# భారతి

సాహిత్య మాసపత్రిక

★

సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

నవంబరు 1958

సంపుటము 35 : : సంచిక 11

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1958




ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్ లో దక్షిణ భారతభాష
లన్నింటిలో వెలువడే ప్రోత్సాహక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# మహాత్మ స్మృతి

శ్రీ కందుకూరి రామభద్రరావు

ఓయి మహాత్మ! నీవొక మహోన్నత పర్వతరాజ మట్లు, భ
ద్రాయితమూర్తివై భరతధాత్రిని నిల్వగ, సర్వమానవుల్
పోయిన సత్తువల్ తిరిగి పొంగులువెట్ట, భవత్ప్రబోధనం
ధాయిత చిత్తవృత్తుల విదల్చిరిగా పరదాస్యశృంఖలన్.

తోసినో రొక నవ్వుపొల్పు వెలార్చినా
పండువెన్నెల మెదల్ నిండిపోయె
పల్కులు జడిగట్టి పైకి వర్షించెనా
అమృత ప్రవాహంబు లంత బారె
కరుణాకటాక్ష వీక్షణములు పరగినా
వంత హృదయవసంతమెనఁగ
ధైర్యహేమాచల దర్శనంబబ్బినా
మంటి ముద్దల వీరమణులు పుట్టె

అవని పులకింప నీవొక్క యడుగుపెట్ట
మానవాంభోధి జయఘోష మార్మ్రోగ
ధర్మ సంస్థాపనార్థ పథంబువట్టి
పుడమిమెట్టిన యవతారమూర్తి వీవు.

ప్రేమకు వచ్చె నీయెడద పెంపునఁ గోమల నవ్యకాంతి, నీ
నేమపు బాటలో నలిగి నిష్ఠయె నూతన పుష్టిగాంచె, గా
రామున నీవు కేలొసఁగ రాచరికంబు వహించె శీల, మే
మేమొ వెలుంగు గుంపులకు నేలిక లయ్యె భవత్కటాక్షముల్

శిథిలపర్ణకుటీర చిరనిరంతరదుఃఖ
ఖిన్నుల కన్నీరు కేలఁదుడిచి
పరదాస్యశృంఖలాబద్ధ నిస్పృహులకు
హృదయగహ్వార తేజ మొసగఁద్రోచి

# హారతి

అజ్ఞాన తిమిరసీమాంతరాంతరముల
మినుకు దివ్వెలు నిల్పి మేలు కనిపి
రక్తసంసిక్త సామ్రాజ్యరాక్షసరాం
భోజముల్ ప్రేముడులోవ్వసి కడిగి

సత్యనాగరక ప్రసన్నతలసదుము
తొలగు జీవితమూల్యంబు నిలువబెట్టి
చన్న నీ స్థితప్రజ్ఞకు స్తవనమేడ
నరుల గుండెలలో కృతజ్ఞతలు దక్క

కానియు లేదు నీకయినఁగాంచన వర్షము నీయధీన, మెం
ద్దానికి లేదు నీవిభుత, కాల్పె ప్రభుత్వము నీదు నాజ్ఞ, లీ
మానవకోటికిన్ శిరసు మండన మయ్యె భవచ్చరిత్ర, వ్యా
ఖ్యానము గీతకున్ బ్రదుకు, కారణజన్ముఁడవయ్య ధాత్రిపై

తూరుపుద్వారమందుఁ బరితోషణ తోరణకాంతిపుంజముల్
దీరిచి, మంగళధ్వనులు దిక్కుల బర్వ స్వరాజ్యలక్ష్మికిన్
భారతనారులు న్నరులు పట్టముగట్టిరి పండువృద్ధవై
వారలనమ్రశీర్షములపై పదజల్లితి మందహాసముల్

పిచ్చికిగూడఁ గొంతగ వివేకము కన్పడు, బుద్ధి యొంతక
మ్మెచ్చున లాగినన్ విడదు మీమహిమోజ్జ్వలమూర్తి లోపలన్
చిచ్చుఅరవ్వలన్ బఱప చేయొటులాడనో! గుండెనిల్పెనో!
చొచ్చె తమస్సు నీ పరుగ, శోకము నిండె సమస్త లోకమున్.

మానవమనోంబరంబున మార్గదర్శ
కంబుగ వెలుంగు ధ్రువతారగా మహాత్మ!
పలు శతాబ్దులు నిల్చెదు, పాశిపద్మ
ములు మొగిడ్చి నమస్కృతమునుఘటింతు.

# స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

కత్తి పట్టకొని జయించలేమో, లేక స్వర్గం దూర గొనడమో వీరత్వం అని సామాన్యుల అభిప్రాయం. కాని ఆయుధాలన్నీ విసర్జించి, మనోబలంతోనే సాయుధుల నెదిర్చి స్థైర్యంతో నిర్జించడం నిజంగా మహాయోధ లక్షణం. గాంధీజీ వెంటవెంబడటగా లోకానికి కనువిప్పు కలిగించి ఈ విషయమే వెల్లడి చేశారు. ఆ రీతిగానే అనేక మంది యోధులు దావకోశంలో నిరంకుశాంగ్లేయ బలాన్ని ఎదిరించి సార్థక జేతలయినారు. ఈ మహాయోధ బృందంలో, ఎవరికీ తీసిపోని మహనీయుడు మన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు.

ఆయనతో మాట్లాడుతున్నప్పుడుగాని, వ్యవహరిస్తున్నప్పుడుగాని ఉన్నవవారి వీరలక్షణం వెంటనే స్ఫురించదు. అనేక ధర్మాత్ములతో, అనుకులం లోడి వారిని నవ్విస్తూ, మహా విలాస పురుషునివలె కనిపించే నారాయణ అయినప్పటికీ, వారి జీవితపంథాలో అసలు విలాసానికి తావులేదనీ, సంకల్పించిన మహాకార్యాన్ని గురించే అనుక్షణము ఆలోచించేవారనీ, త్వరలోనే స్పష్టమవుతుంది. ఇది మహా వీరలక్షణమని వేరే చెప్పనక్కరలేదు. గాంధీమహాత్ముని ధీరధోరణికూడా ఇటువంటిదే. ఇట్టి మహాయోధుల సాంగత్యంలో రోజులు రోజులే నిమిషాలుగా గడిచిపోతాయి. జరపవలసిన కార్యక్రమం మేమయినా ఎగురయితే అదెంత మహా క్లిష్టమైనదైనా అతి తేలిక గాను, సునాయాసంగాను జరిగిపోతుంది. అందుచేతనే, ఎంతటి గొప్ప కార్యక్రమం తలపెట్టినా లక్ష్మీనారాయణగారు తన శిష్యబృందసహాయంతో అదంతా అవలీలగా నిర్వహించేవారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారి ప్రథమ సందర్శనం నేనెన్నడు మరిచిపోలేను. గుంటూరులో ఆనాడు Y M L A అని ఒక చిన్న క్లబ్బు ఉండేది. ఆ క్లబ్బులో ఆనాడు ఉత్సాహవంతులైన యువకులందరు సభ్యులే. లక్ష్మీనారాయణగారు తమ కారాగార వాసం పూర్తి చేసి తిరిగి గుంటూరు వచ్చేరాగా ఆ క్లబ్బు కాయన కూడా రోజూ వచ్చేవారు. సహాయ నిరాకరణోద్యమంలో చదువు మాని వేసిన నేను మళ్ళీ గుంటూరులోని హైస్కూలులో ప్రవేశించాను. ఖద్దరు బట్టలు వేసుకొని గాంధీ టోపీ పెట్టుకొని సాయంత్రం కాగానే ఒకనాడు నేనా క్లబ్బుకు వెళ్ళాను. లక్ష్మీనారాయణగారు ఒక కుర్చీ మీద కూర్చొని అందరితోను ముచ్చటిస్తున్నారు. ఆయన ఏదో చెబుతున్నారు. అవి వింటున్న అందరితో బాటే ఆయన కూడా నవ్వుతున్నారు. వారిని నేను వెంటనే గుర్తుపట్టాను. కాని దగ్గిరికి వెళ్ళి మాట్లాడే ధైర్యం కలగలేదు. ఆయన నన్ను చూచి ఒక్కసారి పక్కున నవ్వారు. నన్ను దగ్గిరికి పిలిచి, భుజం మీద చెయ్యి వేసి, 'ఏం చదువుతున్నావ'ని అడిగారు. 'అయిదో ఫారం' అన్నాను. మళీ నవ్వారు. "ఏం! గాంధీ టోపీ పెట్టుకుంటే మీ హెడ్‌మాష్టరు నిన్ను స్కూలుకు రానిస్తున్నారా?" అని అడిగారు. "రానిస్తున్నారండీ" అన్నాను. "కాదులే, మాఏకా ఆంజనేయుల్ని వెళ్ళగొట్టారులే" అని తిరిగి నవ్వారు. నిజంగా, మహాత్ముని ఆదేశించక్కా, ఇట్టి వీరపుంగవుల కార్యకలాపాలే స్వరాజ్య పథక ప్రథమ సోపానాలై ప్రజలను ప్రోత్సహించాయి. నాడు గుంటూరులో పెద్దమనుష్యులన్న వారంతా ఖద్దరుతప్ప మరొకటి ధరించేవారు కారు. ప్రతి శిరస్సు గాంధీటోపీ అలంకరించేది. ఆనాటినుంచి, దాదాపు ప్రతిదినం నేను వారిని కలుస్తూనే ఉండేవాణ్ణి. ఎప్పుడూ, నవ్వుతూ నవ్విస్తూనే మాట్లాడుతూండేవారు. కాని ప్రతిపదంలోను దేశపరిస్థితులు, మన దానిసత్వం, త్యాగావశ్యకత ప్రతిధ్వనిస్తూ ఉండేవి.

అప్పటికి గుంటూరుజిల్లాలో సత్యాగ్రహోద్యమం అలవాటయింది. చీరాలలో దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, పెదనందిపాడులో కొండా వెంకటప్పయ్యగారు, పలనాడులో ఉన్నవ లక్ష్మీనారాయణగారు నాయకత్వం వహించారు. పలనాటిగడ్డ

సంస్కృత లక్షణములోని వృత్తిగంధి వచనము పద్య భాగబాహుళ్యప్రధానము ఆ పద్యభాగవృత్తియు గణసంఖ్యయు కంటె గురులఘుక్రమము గమనార్హము. నన్నెచోడుని కుమారసంభవములో అట్టి వృత్తిగంధి వచనము కలదు. ఆయా ప్రకరణముల ఆయా ప్రభేదములు వక్ష్యమాణములు. ప్రకృతము వచనము రీతిపరముగ అసమాసకము, దీర్ఘసమాసకము అని ద్వివిధమున స్పష్టము. వసుపరముగ తెనుగువచనము త్రివిధము 1 కావ్యగతమైన గద్యములు. 2 విప్రకీర్ణకములైన చూర్ణికాదులు 3. ప్రత్యేక వచనగ్రంథములు. అందు మరల అవాంతర భేదములు అనేకము. అది వచనరచనా పరిణామము కలవి ఫలస్వాన్వయము ఏకంబిగ వచన పరిదర్శనమునకు సమగ్రాంధ్ర వచన సమీక్షయే కర్తవ్యము.

అసలు పద్యమువలె గద్యము గౌరవప్రదము కాదను దృష్టి కలదు. అట్టి భావన అవిచారిత రమణీయమే. "గద్యమ్ కవీనాం నికషం వదంతి" అని ప్రసిద్ధమైన ఆభాణకము "బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వ" మ్మని మించిన కాదంబరియు, "దండినః పదలాలిత్య" మ్మనిపించిన దశకుమార చరిత్రము వచన కావ్యములే, గద్యగ్రంథములే. పాశ్చాత్యులకును వచనము పరమ ప్రమాణమే 2 ఎలిజబెత్తు కాలములోని ఫిలిప్ సిడ్నీ పద్యకవితకు ప్రతిభటత్వము వహించినది వచనరచనములో మహాకవులు కలరనియే "ఛందస్సులేని ఉత్తమ కవిత ఉండవచ్చును" అనియే కాలరిడ్జి అభిప్రాయము "కావ్యమునకు శ్రుతిలయలవలన కలుగు నిశ్చితత్వము (Certainity) తీవ్రత్వము (Force) నియతత్వము (Regularity) అను గుణత్రితయము పద్యబద్ధమైన కావ్యములలో స్పష్టీకృతమై, హృదయస్పందకములైనట్లు వచనములో కుదరగు" అని మేథ్యూ ఆర్నాల్డు వక్కాణించినప్పటికిని "వచనములోను శ్రుతిలయలు కలవు" అనియే కడ్డీ వాదము. గద్యముకంటె పద్యము గంభీరమన్నది షిల్లర్. అతడు మొదట తానొక కావ్యము గద్యములో వ్రాసి తరువాత పద్యములో వ్రాయగా భావనాభేదమున గద్యరచనము నీరసమనిపించుటేగాక పద్యరచనములో ఆత్మికపనము కలదని తెలిపిన తదుధిజుకవి. కాని ఆంగ్లేయకవులు మాత్రము శ్రుతిలయాత్మకమైన వచనములో రసప్రసరమైన రచనము చేసి "పండితాః సముదర్శినః" అను ప్రవచనమును అన్వర్థము చేసికొన్న అపర్చుకవులు. "పద్యగద్యమయం చం పూరిత్యభిధీయతే"—పద్యగద్యాత్మకమైన చంపూ రచనము ప్రత్యేకాంధ్రసంప్రదాయము. కారణము సంస్కృత చంపూకారులయిన అనంతకవి (భారత చంపువు) లక్ష్మణకవి (చంపూరామాయణము) ఆంధ్రులగుటయే. కాదంబరీ దశకుమార చరిత్రలతో పాటు తచ్చంపూగత మనునవు చూచినిగి ఆంధ్ర సరస్వతికి అధ్యాపకవాణి సంస్కృత వ్యాసనముల్లసితమై సహస్రవసంతనికేతనమైన, విలసితమైన తెనుగు వాగ్వ్యతి నందనవనములో పద్యలతికలు గద్యగతికములు

తెనుగు ప్రాచీనవ్యవహారమే అయినప్పటికిని పాలిచ్చి పెంచిన ప్రాకృతసంస్కృతములు ముఖ్యముగ సాహిత్యముఖమున ఆంధ్రుల ప్రథమసాహితి గాథా సప్తశతి ప్రాకృతమే. ప్రాకృతము శాతవాహనుల కాలమున రాజభాష. అనాటి హాలుని అర్ధాంగి లీలావతికి సంస్కృతమే లీలావిలాసము. ఆ రాణీగారికి అల్పకేసలోను గీర్వాణమే! పాపము, హాలునికి సంస్కృతము పాతమైనది వలవులనాడు సంస్కృతము పాలకవ్యవహారభాషయై మూడుకొట్లి శాసనము లందుకు మూడల అట్టి ప్రాకృత సంస్కృతముల ప్రాభవమున ఆంధ్రులదేశభాషకు అనువిహాంత అసలు దేశభాష అనదిన వాగ్వ్యవహారము ప్రతిభాషకు వది ప్రాథమికదశ వాగ్వ్యవహారము వచనైక రూపము ఆ వచనము ఆలంకారిక రచనమైనపుడే ప్రత్యేక వాఙ్మయప్రాదుర్భావము వ్యవహారదశయందర్థమానము. వాఙ్మయవచనమునకు వ్యవహారవచనమే ప్రాతిపదిక. ప్రాచీన వ్యవహారవచనమునకు ప్రభువుల శాసనము లెంతవరకు ఉపాధులు ప్రజా దైనందిన వ్యవహారవచనమునకు ప్రత్యేకవసతి లేదు ప్రభుశాసనములందే ప్రజావాణి సత్ప్రతిఫలనము సాధకము అది వచన రచనాప్రాథమికదశ ఉపలబ్ధశాసనములలో ఉన్నది మొదట గద్యము. తరువాత పద్యము కాని పద్య కవిత్వము తరువాత గద్యకవిత్వము క్రమపరిణామము నిజమే, శాసనవచనము కవిత్వగచనము కానేకాదు. కేవల పాలక వ్యవహారములోనిది వచనము శాసనములు వార్తాప్రధానములు పత్రికలవంటి శాసనములలో ప్రత్యేక సంచికలవలె వీరాజనములవలె పద్యముల పల్లవి సంభవము. కనుక శాసనములలో ప్రథమతః

(2) అముద్రిత సాహిత్య విమర్శనము—పింగళి లక్ష్మీకాంతముగారు.

# దివ్యదీపావళి

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

ఇదిగో! దీపము లెల్ల వెల్గె నిపు డింటింటఁ గవాక్షమ్ములున్
వివృతంబైనవి, సర్వమానవ మనో వీథీ సుహృద్భావ గౌ
రవ మవ్యాహత దివ్యదీపకళికాలంకారనీరాజనో
త్సవమై పర్వెను దిగ్దిగంతర పరీత శ్రీవిరాణ్మూర్తికిన్.

ఏ యింట వెలిగిన నేమి యీ దీపంబు
లింటింట నొకకాంతియే రహించె
ఏ చోట బుట్టిన నేమి యీ పసివాడు
సర్వ మానవ సమాజమ్మువాడె
ఏ పాట బాడిన నేమి యీ దినమున
ధ్వనియించు నాత్మకత్త్వం బొకండె
ఈ రోజు నా యింటి ద్వారాలు దెఱతు నా
హూతులకును ననాహూతులకును

రండు! మీ కందఱకు సోదరుండ నేను
వ్యక్తిగతమెల్ల నేను ప్రాపంచికమ్ము
నర్చి సేవింతు నా జగన్నాథదేవ
పూర్ణ మంగళాలంకృత స్ఫూర్తి మూర్తి!

ఎచ్చట నీదుపుత్రులు సహింపగరాని దరిద్రతాభరం
బచ్చగ మోయుచున్ ధన మదాంధులచే నవమాన్యులయ్యు ని
ష్పచ్చరమైన యీ బ్రతుకు బాటల దివ్వెలబారు దీర్చికో
అచ్చటికిన్ జగమ్మును దయాపరతన్ దరలింపుమో ప్రభూ!

డాక్టర్ : ఆవిడకి సంతోషమంటూ లేదన్నానే, ఆవిడకి ధైర్యమూ, సంతోషమూ రెండూ ఇవ్వగల గాలి

రామం అది సాధ్యమా ?

డాక్టర్ : సాధ్యం కాకపోతే లోపం నీది

రామం (ఆలోచించి) కానీ . (లేచి ఆవేశంగా) నే తప్పు ఎవరున్నారు (ఆవేశం తెచ్చుకుని) ఇలా అన్నా ఋణం తీర్చుకుంటాను! కమల నోసారి చూసివస్తాను ఎందుకనకండి నాకిప్పుడు ధైర్యం కావాలి

(రామం లోనికి వెళ్ళగానే సరోజ వస్తుంది)

సరోజ నమస్కారం .

డాక్టర్ నమస్తే

సరోజ ఎలా ఉంది డాక్టర్ గారూ ?

డాక్టర్ ప్రమాదం దాటింది

సరోజ (ఎదురుగా గోడకి ఉన్న దేవుడి పటానికి నమస్కరించి, కుర్చీలో కూచొని, కళ్లొత్తుకుంటుంది)

డాక్టర్ మీరు అట్టే రావడం మంచిది కాదు.

సరోజ : నాకేం భయం లేదు

డాక్టర్ మీకు భయం లేనంత మాత్రాన రోగం మిమ్మల్ని చూసి భయపడుతుందా ?

సరోజ : రావాలని ఉంటే ఎక్కడున్నా వస్తుంది.

డాక్టర్ మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది.

సరోజ ఎన్నాళ్లు పడుతుంది కోలుకుందుకి ?

డాక్టర్ . మరో నెల్లాళ్ళు

సరోజ : (పదిసెకండ్లు ఊరుకుని) డాక్టర్ గారూ కొంత కాలానికన్నా కమల ఎప్పట్లా నే

డాక్టర్ నే నేమీ చెప్పలేను చూడనే చూసేరు కదా ఎంత తీవ్రంగా వచ్చిందో ఈవిడకి

సరోజ ఏమన్నా ఆశించవచ్చునా ?

డాక్టర్ నే నేమీ చెప్పలేను కళ్ళ సంగతికూడా అనుమానంగానే ఉంది

సరోజ (లేస్తూ) కళ్ళా!

డాక్టర్ (జాలిపడ్డట్టు తలఊపుతాడు)

సరోజ (కూలబడి) అయ్యో కమలా ! (చీర చెరగు అడ్డుపెట్టుకొని నిశ్శబ్దంగా ఏడుస్తుంది )

డాక్టర్ : కరడుకట్టిన నాకూ ఎంతో బాధగా నే ఉంది . ఎంత చలాకీవన పిల్ల (ఊరుకుని) ఇలాంటివి జరుగుతూ ఉంటాయి ఎవరూ ఏమీ చెయ్యలేరు

(రామం వస్తాడు)

డాక్టర్ : (రామాన్ని చూసి) ఇప్పు డామెకి ధైర్యాన్నిచ్చే బాధ్యతల్లా రామంది

రామం (ఒకక్షణం ఊరుకొని) నాలో నాకే నమ్మకం లేదు.

డాక్టర్ : ఈ క్షణం నీకలా అనిపిస్తోంది సావధానంగా ఆలోచించు ఆమెపట్ల నీ కర్తవ్యం

రామం : కర్తవ్యమా ? కానీ కర్తవ్యముంది.

డాక్టర్ మనసుకి చేసే మందింక లేదుకదా

రామం ఏంచేసేందుకూ పాలుపోవడం లేదు

డాక్టర్ : నువ్వామెకి అండగా ఉండి, ధైర్యం కలిగించాలి. నువ్వెప్పుడూ తనతో నే ఉన్నానన్న నమ్మకం ఆమెకి కలగాలి

రామం : నాలో కమలకి నమ్మకం లేదనుకుంటున్నారా డాక్టర్ .

డాక్టర్ ఈ సంగతి అతి సున్నితమైనది ఆమె మానసికంగా బాధపడవచ్చు నీకు తెలుసు నా నోటంట చెప్పించకు అందు కామె కా అనుమానం

రామం : ఎప్పుడూ లేదు . ఎప్పుడూ లేదు ఆ మాట కొస్తే నేనే (ఆగిపోయి తల అడ్డంగా ఊచి) ఉహుం (సరోజవేపు అనుమానంగా చూసి) నువ్వెందుకొచ్చావ్ ?

సరోజ (ఆశ్చర్యపోయి) అదేమిటి రామం !

రామం నిన్నెవరు రమ్మన్నారు ?

సరోజ నా మానాన నే వచ్చేను.

రామం రాకు .

డాక్టర్ ఇదేంమాటలయ్యా రామం.

సరోజ ఎప్పుడూ వస్తున్నా కదా.

రామం ఇంక రాకు నీకేమయినా అయితే ఎవరు పూచీ పడతారు ?

డాక్టర్ హా అదా (నవ్వుతాడు) నిజమే నిజమే

సరోజ మొన్న రాగా లేంది ఇప్పు డేమొచ్చింది ?

రామం సరే సరే మీ ఆడజాతి కో నమస్కారం--మొండిపట్టుపట్టిన దానిగతి అలా అయింది..

సరోజ . నాకేం అవదు .

రామం : అదుగో 'వానిటీ' తిక్క తవాల్లి కన్న మన్వైదో చేరదీసుకుంటున్నావ్ చూశా!

డాక్టర్ : (చిరాకుగా చూసి) సరే. నే ఇంక వెళ్తాను. నే చెప్పింది గుర్తుంచుకో..

రామం (ఇది జ్ఞాపకం వచ్చినవాడిలా అయి) ఉంచు కుంటాను కమల సుఖంకన్న నాకు కావల్సిం దేముంది?

(డాక్టర్ వెళతాడు)

సరోజ : ఎందుకలా విసుక్కుపడ్డావ్ ?

రామం : నీ కిప్పుడు సంజాయిషీ ఇచ్చుకోవాలా?

సరోజ : (ఊరుకోని) రామం — డాక్టర్ గారన్నది నిజమే?

రామం ఏమన్నారు?

సరోజ : కెళ్ళకరించి

రామం (చిరాగ్గా) నీతో ఎందుకు చెప్పేను?

సరోజ అర్థంలేని ప్రశ్న

రామం అర్థంలేదు !

సరోజ లేదు

రామం నువ్వింక వెళ్ళు దాని కర్థముందా?

సరోజ లేదు.

రామం లేదూ?

సరోజ : లేదు

రామం (కర్చీలో కూలబడతాడు) (సరోజ లోనికి వెళ్ళబోతుంది) వెళ్ళకు

సరోజ : వెళ్ళను కమలని చూసి—

రామం అక్కడికే, వెళ్ళకు—

సరోజ ఏం?

రామం : నీయిష్టమూ నాయిష్టమూ?

సరోజ : ఇష్టం అయిష్టం ప్రశ్నలే? చూడటం తప్పా?

రామం : ఎందుకు నీకా క్యూరియాసిటీ?

సరోజ ఇవాళ నీ తత్వం ఎందుకిలా ఉందో అర్థమవ టంలేదు

రామం : అర్థం చేసుకుంటేకి ప్రయత్నించకు—

సరోజ : కమల స్థితి చూడగా అలా ఉంది ఈ నీధో రణికి అర్థమేమిటి?

రామం : ఒకచో అర్థం మాట్లాడ్డం తప్ప ఇప్పుడు చెయ్యగలిగేదేమీ లేదు

సరోజ : ఈ మాటలు కాదు..

రామం పోనీ ఏం మాట్లాడాలో నువ్వే మాట్లాడు..

సరోజ అనవసరం

రామం : అనవసరం అయినది ఏదీ లేదు అటంలేని వాటుకూడా ఆ మనిషి మానసిక స్థితి నిరూ పనే

సరోజ సంజాయిషీ ఒద్దులే—

రామం (ఊరుకోని) చెడ్డవాళ్ళని శిక్షించి, మంచివా ళ్ళని రక్షిస్తాడు దేవుడు

సరోజ నీ మానసిక స్థితి నిరూపణే అనుకోవాలా ?

రామం : తప్పకు—ఈ విషయంలో ఇది అక్షరాలా నిజం

సరోజ (ఆశ్చర్యపోయి, కర్చీలో కూచొని) ఎవరా చెడుమనిషి కమలా?

రామం (తెంపలు వేసుకుని) నేను

సరోజ నీకేమయింది?

రామం ఇంకేమవాలి?

సరోజ ఓను నీకేమయింది?

రామం ఏమీ అవలేదా?

సరోజ నీకేమీ కాలేదు — బాధ పడుతున్నది కమల

రామం అంతే అంటావా?

సరోజ అంతే

రామం నీకు మనసు లేదు

సరోజ ఎలా పోల్చేవ్ ?

రామం నే ఎంతబాధపడేదీ గ్రహించలేకపోయేవ్

సరోజ క్షమించు రామం నువ్వు బాధపడుతున్నావ్ నాకు తెలుసు కాని శిక్ష అనుభవించేది కమల కాదూ?

రామం : డాక్టరన్నదే అయితే నేనూ శాశ్వతంగా ఆబాధ పంచుకోవాలా ఒద్దా?

సరోజ (ఆశ్చర్యపోయి) ఏమిటీ? నువ్వింత..!

రామం నేను ఏమిటి?

సరోజ (మెల్లగా చూసి) ఇంత స్వార్థపరుడ వనుకో లేదు

రామం (ఆవేశంగా లేచి) ఏమిటంటున్నావ్ ?. నేనా? ఎలా? చెప్పాలి చెప్పు? కమలని నా ప్రాణసమానంగా చూసుకుంటున్నాను కమల బాధ నాబాధ కాదూ? అందుకు నేను స్వార్థ

# ఆత్మహత్య

రాము: నువ్వేడకూడదా!

సరోజ: (కోపంగా చూసి, ఆనక చిరునవ్వు తెచ్చుకుని) వెళితే వెళ్ళొచ్చు

రాము: విశాల మొండికెత్తిందా!

సరోజ: (సిగ్గుపడి) ఎవరన్నారు!

రాము: కలొచ్చిందిలే

సరోజ: ఇంకేమొచ్చింది కల!

రాము: మరేం రాలేదు—

సరోజ: సరే ఇంక చెప్పు (లేచబోతుంది)

రాము: (చెయ్యిపట్టుకు కూర్చోబెట్టి) ఓ వివాహిత మహిళ ఈ విద్యార్థితో మాట్లాడితే కష్టపెట్టుకున్నారా?

సరోజ: (కూచొని 'ఏకాగ్రతగా' చూస్తుంది)

రాము: ఆఁ పోఁ అయితే పోకలా?

సరోజ: ఏది?

రాము: కౌమారం

సరోజ: అదా. ఔను

రాము: నీకు శాస్త్రీయం ఇష్టమా?

సరోజ: ఇష్టమే—

రాము: వినయిలా ఇష్టమయితే మనసుకు హాయిగా ఉంటుంది కదూ?

సరోజ: ఒకో అప్పుడు ఉంచదు

రాము: ఎప్పుడెప్పుడు?

సరోజ: ఒకోప్పుడు—

రాము: ఇవాళ హాయిగా ఉండొచ్చు ..

సరోజ: ఉండొచ్చు

రాము: హాయిగా అంటే ఆనందంగా

సరోజ: ఔను .

రాము: హాయిగానూ ఆనందంగానూ . ధ్వనితో ఏకమయి ఔనా?

సరోజ: ఔను.

రాము: (చిరునవ్వు నవ్వి) సంతోషిస్తావా? ఆనందిస్తావా . ఇవాళ?

సరోజ: (చిరాగ్గా) ఏదో ఏడుస్తాను

రాము: మీ విశాల సంతోషిస్తుంటా . ఆనందిస్తుందా? ..

సరోజ: అదిన్నాదుగు.

రాము: మీ ఇద్దరూ సంతోషించి ఆనందిస్తారా?

సరోజ: (కోపంగా) ఏదో ఏడుస్తాం

రాము: ఏడుస్తారా? అయ్యో అయ్యో ఇక్కడికి రాకపోవల్సిందే

సరోజ: ఏం?

రాము: కమలని చూసేవ్—ఈ ద్విక్షణంతో మనసులో పెట్టుకున్నావ్ నీ సంతోషమల్లా ఏడుపు కింద మారిపోతుందే అని నా భయం

సరోజ: ఆఁ!

రాము: మరదా? అయితే నీకు కమలమీద ఏమీ ప్రేమ లేదన్నమాట—

సరోజ: అన్నీ నువ్వే చెప్తున్నావ్

రాము: ఏడుపుకింత మాటకుందా? మీ విశాలతో అక్కడికి వెళ్ళక తప్పదని తెలిసి, ఇక్కడికొస్తే మనసు విచారంగా అయిపోతుందని తెలిసికూడ వచ్చేవ్. ఎందుకమ్మా అంత ఆత్రం? అంత క్యూరియాసిటీ?

సరోజ: నా మనస్సు ప్రతిమాట్నీ 'ఎనలైజ్' చేసి చెప్పాల్సిన అవసరం నీకూ లేదు నాకూ లేదు సె వస్తున్నా

రాము: అగాకు నాటకం చూస్తావా?

సరోజ: ఏదో చేస్తాను

రాము: చూడు చూడు ఎలా నటించాలో తెలుస్తుంది

సరోజ: రాము నా మనస్సు కష్టపెట్టాలని చూస్తున్నావ్ ఏమిటి నీకా ఆనందం?

రాము: పలహా ఇస్తున్నాను

సరోజ: థాంక్స్—అక్కర్లేదు

రాము: ఇందాక ఏమన్నావో జ్ఞాపకం వుందా?

సరోజ: ఏమన్నాను?

రాము: జ్ఞాపకం లేదూ?

సరోజ: ఓమాట అడగనా?

రాము: అడుగూ .

సరోజ: నే సంతోషంగా వుండడం నీకిష్టం లేనట్టుంది

రాము: ఇదొక్కడి వాద్యం ఈ ప్రశ్న ఎందుకు వేస్తారో తెలుసా... పెళ్లాం కాని...ప్రియురాలు కాని..

సరోజ: (కోపంగా) మాటలు సరిగా రానీ నే సంతోషంగా ఉంటే నీకెందుకూ అసూయ

సరోజ (కుర్చీ లాక్కొని కూచొని) నువ్వు నన్నువ్ నిన్ను చూస్తేనేకాని, ఉండలేక వచ్చేననుకుంటావ్

రామం కాదూ?

సరోజ: కాదు నే రోజూ వచ్చేది కమలని చూసేందుకే

రామం: అది నెపం అనుకో

సరోజ: నే అంత మనసులేని దాన్ననుకున్నావా?

రామం: ఉంది నా మీద—నువ్వు నన్నెంతగా ప్రేమిస్తున్నావో నాకు తెలీదా? నీ మాటలు నమ్మకుండను

సరోజ అయినా మోహాన చెప్పడం నీకో అలవాటు కింద మారింది. నిన్ను, భరించలేనంతగా ప్రేమిస్తున్నానని నా మనసుని నమ్మించడానికా నీ ప్రయత్నమల్లా?

రామం: నీ సంగతి నిజం కాదా?

సరోజ: నువ్వంటే నా కిష్టం ఉండొచ్చు అలా అని నేను నా ఇష్టానికి లొంగిన అయిపోయేంత దుర్బలను కాను

రామం: అనంతో ఒద్దు నే అంటే నీ కిష్టము కాదా

సరోజ అవొచ్చు

రామం అది చాలు—

సరోజ ఏమిటి నీ ధోరణి—నువ్వంటే నే ఇష్టపడటం నువ్వేదో నీ విజయంగానూ, గొప్పగనూ నా ముందు చాటుతున్నావ్ నీ అహానికది తృప్తినిస్తోంది అది నాకు తెల్సు-కాని ఒకటి నువ్వు తెల్సుకుంటే మంచిది. నీ అహాన్ని తృప్తిపరచే యంత్రాన్ని మాత్రం ఎప్పుడూ అవను—

రామం: (తగ్గి జాలిగా గొంతు పెట్టి) కోపగించుకోకు సరోజా నువ్వే లేకుంటే నే నిలువాలి?

సరోజ: (మెత్తబడి) అదుగో ఏమన్నా అంటే జాలిగా ముఖం పెడతావ్.

రామం ఏం చెయ్యను నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న నిజంలో నా కెంత బలముందో నీకేం తెల్సు తెల్సుకోలేవూ!

సరోజ (మృదువుగా) మనం ఇంక అపడం మంచిదేమో రామం

రామం: ఏది?

సరోజ తెలిసి అనుకో—నేను నా దుర్బలతకి లొంగడం నాదే తప్పు

రామం కోప మొచ్చిందా సరోజా

సరోజ కమలని మన మిద్దరం మోసం చేస్తున్నాం. కమల నాకు అప్తురాలు నీకు కమలపట్ల—

రామం నా మాటమీద నమ్మకంలేదా? ఎన్నిసార్లు చెప్పినా నమ్మవా సరోజా?

సరోజ: నమ్మకం సులభమా? కమలంటే ప్రేమ ముంటాద్ కాని ఇతరులులేని మమకారం నా మీద నీకు ఏర్పడింది—ఏమనుకోడం

రామం ఇది నువ్వు నమ్మాలి కాని బుజాలు చేయ్యమంటే నేనేం చెయ్యను

సరోజ కమల స్థితి చూస్తూ నువ్వన్నది నమ్మడం కష్టం కదా?

రామం నా ఆత్మని దంపేసుకున్నానని నీ ఉద్దేశమా?

సరోజ దీని కర్థమేమిటి? కనీసం నా మనసుని తృప్తి పరచుకుంటున్నా ఒక సంజాయిషీ ఉండాలి కదా, నా కెంత స్వార్థమున్నా

రామం (చిరునవ్వు నవ్వి) ఇన్నాళ్ళూ ఏదో లోటు ఉన్నట్టే అనిపించేది ఏమిటో తెల్సేది కాదు. ఇప్పుడు తెల్సుకున్నాను. కమల నా మనసు నువ్వు నా బతుకుని రెండూ లేనిదే నాకు పరిపూర్ణత లేదు

సరోజ: (అనుమానంగా చూసి తలదించుకొని) గోజా నా మనసులో ఎంత అశాంతి రేగుతోందో నీకు తెలీదు తెలిసినే ఎలా మోసం చేసేది కమలని?

రామం: నా మీద నీ కిష్ట ముంది కదా?

సరోజ: ఐతే?

రామం కమల మనిద్దరికీ అప్తురాలే ఇందువల్ల కమల మనకి మరింత దగ్గరౌతుంది

సరోజ నువ్వన్నది పేలవంగా ఉంది..

రామం కానీ ఇది నిజం-నా మనసుకు పరిపూర్ణత లేనిదే నే సంతోషంగా ఉండలేను.. నే సంతోషంగా ఉండక పోతే కమలకా అసంతృప్తికి వేరు కారణాలు తీసి బాధ పడుతుంది—కమల బాధపడటం మనం ఇద్దరం చూడలేం. ఔనా ఔనా కాదా...

రామం  అది నా విధి—

కమల : ఏం మాటలు! విధి కొట్టి చేస్తున్నట్టు

రామం  మనసుకి దగ్గరగా ఉన్నవారితోటే విధు లుంటాయి.

కమల  మీకు వాగ్దానం బాగా నచ్చు

రామం : దీనికే ఉబ్బితబ్బిబ్బవకు

కమల  సరోజ స్నేహం నా అదృష్టం—పిలవకుండా వచ్చి, దగ్గరకూచొని వెళ్లిపోయింది ఇంత ప్రేమకి నేను తగను—అందుకు నాకైతే కారణ మయితే అంతకన్న సిగ్గుపడవలసింది లేదు

రామం  అపోహపడకు

కమల  నాకు జాలిపడ్డం కంటే, కష్టసుఖాలు చూస్తే జాలి వేస్తుంది అసహ్యం కూడా వేస్తుంది అదే బాధయం

రామం  నీకీ ఆలోచన్లు అలవాటయింద మానేయి—

కమల  నిజమే నాలో నాకు నమ్మకం పోతోంది. అందుకే నాకీ అనుమానాలన్నీ మా

రామం  ఏ అనుమానాలు?

కమల  మీకు ప్రేమనిస్తున్నానని

రామం  అంతేనా?

కమల  మీకొక కుటుంబంలా ఉన్నాననిపిస్తుందో కొ అప్పుడు

రామం  (నవ్వుతాడు)

కమల  ఆ నవ్వడంచూస్తే ధైర్యం వస్తోంది

రామం  ఎందుకు నీకు ధైర్యం?

కమల  ఇదే చిమికేమి ఇరవ్వక, మీకొక భారంగా ఉండి ప్రేమనిస్తూ ఉంటే మీకు విసుగు పుడుతుం దేమోనని భయం

రామం  నీకు అనుమానం కలిగించే పని లేమన్నా చేసేనా?

కమల  అట్లాంటిది లేదండీ

రామం  నీ కెదో అనుమానం వేసి ఉండాలి.

కమల  (ఊరుకుంటుంది)

రామం  ఏమిటా అనుమానం?

కమల  మరేమి లేదు మీరు మునుపట్లా నాతో లేక పోయేటప్పటికి

రామం  అంటే?

కమల : కోపమా?

రామం : లేదు కమలా చెప్పు

కమల  నాతో ఎంతో ప్రేమగా, లాలనగా మాట్లాడే వారు ఇప్పుడు మీకు తీరిక లేక

రామం  ఇందుకేనా

కమల  కూర్చుని ఏదో ఆలోచన్లు అయినా నేను అందుకు తగనప్పుడు ఆలోచనం

రామం  అదుగో మళ్ళీ ఇలా మాటాడితే నాకు చిరాకు

కమల  అదుగో చూసేరా? మీకు చిరాకు కలిగింది

రామం  చిన్న సంగతులు మనస్సులో పెట్టుకొని ఇలాటి ఆలోచనలు చెయ్యకు—

కమల  క్షమించండి మళ్ళీలా అనుకోకండి—

రామం  ఆ క్షమించమనడం చూస్తే అనుమానం నీకుంది-

కమల  నా కనుమానం ఉంటే నాదే తప్పు మీ అనురాగాన్ని చేజేతులా పోగొట్టుకుంటున్నట్టే అందువల్ల

రామం  (కమల చేతిని అందుకుంటాడు)

కమల  అదుగో సరోజ

రామం : నా కగపడలేదు—నువ్వు పసిగట్టేసేవ్

కమల  ఒకరికొకరి తీసుకున్నప్పుడు నవ్వు ఇంకొకరి కది ఎక్కువ చేస్తాదుట

(సరోజ వస్తుంది)

సరోజ  కమలా చాలా కులాసాగా ఉన్నావివాళ?

కమల  ఒకనాడు కులాసాగా లేనుకనకనా

సరోజ : ఆ చిరునవ్వే అది .

కమల  నీకన్నీ కొత్తే

సరోజ  నువ్వెప్పుడూ కొత్తే (కూచొని) రోజుల తరబడి విచారంగా ఉంటావ్ అసలు విచారమూ ఉండదు, నవ్వూ ఉండదు. ఆలోచిస్తూ ఉంటావ్ ఒకోనాడు ఇంత కులాసాగానూ ఉంటావ్.

కమల : మీ ఇద్దరి ప్రేమ, అనురాగం నా కుండగా సంతోషం కేమి తక్కువుంటుంది నాకు—

సరోజ  ఎప్పుడూ అలా ఉండరాదూ?

కమల  అత్యాశకూడదు. ఇంత అనురాగానికి అలవాటు పడ్డదాన్ని అది లేకుండాపోతే ఏమవుతుం దో నని అనిపిస్తూ ఉంటుంది.

(రామం, సరోజ ఒకరినొకరు చూసు కుంటారు—)

# ఆత్మహత్య

కాని ఒకభాగం వ్యక్తమౌతాయి ఒక్క పగిలిన వళ్ళి ఆమె జారుపట్టుకొని) బతావు ముండా! (ఆమెనలాగే లాక్కొస్తాడు)

సరోజ (పెనుగులాడుతుంది—కాని లాభం ఉండదు) కమలా! కమలా!

రామం (ఆమెని టేబిలుమీద తిరగద్రోసి ఆమె తల నేలకేసి కొడుతూ) నీకు లేని రండా! నాది స్ఫోటకం మొహమా మహ్వే మహా అందగత్తె నని అనుకుంటున్నావా నీకే నీ అందం తేల్చి పారేస్తాను

(కమల వస్తుంది)

కమల (కంగారుగా) ఏమయింది ఏమయిందండీ

సరోజ (ఏడుస్తూ) కమలా కమలా

రామం నోర్మూయ్యి (సరోజ నోరు మూసి) అందం ఉన్నంతకాలం మీఆడవాళ్ళు ఒక్కటే దానికితగిన శాస్తి దేవుడే చేసేను నీకు శాస్తి నే చేస్తాను ఏది ఆకతైన అందుకో ఒడ్డి దానిని నీకెం కనిపిస్తుంది చేసి తీసు కుంటాను (ఆమెను టేబిల్ వరకూ ఈడ్చుక వెళ్తాడు ఆమె లేచి పెనుగులాడుతుంది ఆమెను క్రిందకితోసి) ఇంత అహంకారము (ఆమె తలపట్టుకుని పెనుగులాడుతాడు)

సరోజ రాక్షసుడా ఒదులు

రామం రాక్షసుణ్ణా

కమల అత్తయ్యా! అత్తయ్యా !

రామం నీ రక్తం కళ్ళజూస్తాను నాతో పోయింది అడ్డమయిన మగాళ్ళందరితోనూ పోయింది దీనికి మనసు కావాలిట మనసు నాది స్ఫోటకం మొహమట!

సరోజ నీ మొహమేకాదు నీమనసు కూడా నీచు (సరోజ లేస్తుంది రామం మళ్ళీ ఆమెను క్రిందకి తోస్తాడు టేబిల్ తగిలి రక్తం కారుతుంది ఆమెతలనుండి తల్లివచ్చి నిలుచోయి చూస్తుంది)

రామం ఉండు ఇంకా అవలేదు నీపని (కాలు ఎత్తి తన్నబోయి, తల్లిని చూసి ఆగిపోతాడు )

తల్లి ఏమిటిదంతా! ఏమిటిరామం! (సరోజముంగు వాల్చి, ఆమెను తన ఒడిలోకి తీసుకుని) అయ్యో సరోజా (ఆమె రక్తం తుడిచి, చీర కొంగు అక్కడ నొక్కి పెడుతుంది) అయ్యో నాతల్లే .

కమల: (రామంని చేతుకొని, తనుముకుంటూ, అతని భుజం పట్టుకొని) ఏం చేసేరు, ఏమయింది సరోజకేమయింది

తల్లి (కోపంగా, దుఃఖంతో వణికిన గొంతుతో) రామం! చివరికి నీతల్లిని కాను ఇలాంటి రోజంటూ వస్తుందని నే కలనైనా అనుకోలేదు.

రామం ఇంక నాకు నీతులు చెప్పకు - నేను ఎవరికీ ఏమీ కాను - అనాథ దారికెవరికీ ఉన్నందుకు ఫలితమిది

తల్లి: నిజమైనమాట అన్నావ్ నాయనా

రామం (దెబ్బతిన్నవాడిలా కాంగా) అం! ఏంటి అన్నావ్! (కుర్చీలో కూలబడతాడు నీరసంగా)

తల్లి లే సరోజా రాతిలో లో గురికా (సరోజని లేవదీస్తూ బాధపడుతూ లోపలికి తీసుకువెళ్తుంది)

రామం నిజానిజాలు తెలీకుండా మాట అనకూడదమ్మా

తల్లి అన్నీ గ్రహించేన్నాయనా

రామం: నువ్వూనా కాదు తిరిగే వన్నమాట—

తల్లి: అలా అని నన్ను బాధపెట్టకు బాబూ (సరోజతో లోపలికి వెళ్తుంది)

కమల (తనుముకుని అతని దగ్గరగావెళ్ళి కూచొని అతని కాళ్ళకు తలవాన్చి) ఏమయిందో నాతో చెప్పండి

రామం: (ఆమెను విదిలించి) ఛీ! ఫో!

కమల (అతని కాళ్ళు పట్టుకొని) ఎందుకొచ్చింది మీకు కోపం ఎప్పుడూ లేని దివాళీ

రామం నన్ను ముట్టకోకు చెయ్యితియ్యి

కమల ఈ కోపమంతా ఎందుకో చెప్పండి

రామం కోపం కాదు అసహ్యం మనస్యంటే నాకసహ్యం

కమల (ఏడుస్తూ) ఏం చేసేనో చెప్పండి

రామం: నిన్ను చూసి భరించలేను. నిన్నేనా

కమల (అతని పాదాలమీద పడి) మీ పాదాల ముందు ఉండనిస్తే చాలు . మీ మనసుకు దగ్గరగా ఉన్నాను నన్ను

రాముం గుడ్ గాడ్! నీకూ మనసే కావాలి. కేవలం భరించలేను ఆరి భగవాన్!

కమల అయ్యో!

రాముం (ఆమెను తోసి) దేవుడే నాకు న్యాయం చేశాడు! అందమైన భార్య కావాలని కోరుకున్నాను—మరి అందమైన దానినిచ్చాడు ఆ అందంలో నన్ను నరకయాతన పెట్టేవ్ నా వ్యక్తిత్వాన్ని, నా ఆత్మగౌరవాన్ని చంపేవ్ ఎన్ని ఘోరాలు చెయ్యాలో అన్నీ చేసేను అణుగుక్క పోయాను నీకు జబ్బు వచ్చే వరకే నా గుండెలోంచి పెద్ద బరువు పోయింది నిజ్ఞానాకే బరువుపోయింది

కమల (తల వెలుకు కొట్టుకుని) అయ్యో దేవుడా!

రాముం కాని మధ్యపడే బతుకేవాడికి పాపులని శిక్షిస్తూనే ఉంటాడు దేవుడు నీ అందాన్ని, కళ్ళని కూడా తీసుకున్నాడు నన్ను శిక్షించడానికి ప్రతిక్షణం నీ ముందు, నీ మొహం చూస్తూ ఉండవలసింది నేను ఎంతకని ఓర్చేది. నరకానికి నాద్వొక్కడ! నేనూ మనిషి నేనా! నువ్వెంత వికారంగా ఉన్నావో నువ్వు నమ్మవుకదూ! (నవ్వుతాడు)

కమల (ఏడుస్తూ) ఔను! మీరన్నది నిజమే. మీ బతుకు మీకు బాధగా చేసిన పాపాత్మురాల్ని ఔను!

రాముం నేనూ పాపాత్ముడ్ని! నువ్వుకావు. నీ రూపంలో దేవుడు నన్ను శిక్షిస్తున్నాడు నువ్వు దేవుడిలా భాగానివే! దేవతవి!!

[పకపక నవ్వి, పోతాడు]

కమల: (నిశ్చేష్టురాలయి ఉండిపోతుంది, కూచొని, ఎటో చూస్తున్నట్టు ముఖం పెట్టి అలా ఒక నిముషం కూర్చుంటుంది లైట్లన్నీ ఒక్కటొక్కటే ఆరిపోతాయి స్టేజ్ మీద చీకటి ఆ చీకటిని చీల్చుకుని కమల గొంతు) అమ్మా! ఎక్కడున్నావ్! నన్ను తీసుకుపోవూ! నన్ను పిలుచుకోవూ నా తల్లి!!

[ తెర ]

# కాటయ వేమభూపతి

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్రభూభాగమున సముద్రప్రదేశమును మన్యభాగమున నిరుపద్రవముగను సర్వోత్తరముగను శతాబ్దికాలము పైగను పాలించిన ప్రభువులలో వేమనామధారులైన రెడ్డిప్రభువులు ప్రధానముగ గణింపఁదగినవారు. కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత, ఆంధ్రదేశము యవనాక్రాంతమై భ్రాంతము ధర్మము విధ్వస్తమైనప్పుడు తదుద్ధరణమునకై బుద్ధిబాహుబలములు వినియోగించి, తదుద్ధారమునకై యత్నించినవారిలో ప్రథముఁగణ్యుఁడు ప్రోలయ వేమారెడ్డి. ఈతఁడు మహాశూరుఁడు పరమ ధార్మికుఁడునై, అద్దంకి రాజధానిగా రాజ్యపాలనము సేయుచు ధర్మోద్ధరణమునకు పారమ్యతిపోషణమునకు శాంతియుఁ దోడ్పడెను. శివకేశవులం దతఁడు భక్తిభావ సమన్వితుండై శ్రీశైలాహోబల క్షేత్రములందు సోపానసరణి కట్టింపఁజేసి పుణ్యకీర్తుల నార్జించిన ధన్యుఁ డీతఁడు. ఆంధ్రవాఙ్మయోద్ధారకుఁడై శంభుదాసుఁడను ఎఱ్ఱాప్రెగడచే రామాయణ హరివంశముల నాంధ్రమునం దనువదింపఁజేసిన ధన్యుఁడు శ్రీశైలవాసియగు ఘోడరాయ గురువర్యుని యాదేశానుసారము రాజ్యపాలనము సాగించుచుఁ, దగుపద్ధతివిధానమున హేమాద్రిదానముల నాదరించిన ధార్మికుఁడు. ఈ విషయమంతయు [illegible] వరపు శాసనమునం దిట్లు పేర్కొనఁబడియున్నది.

శ్లో. శేమాం ప్రశస్తసుమహిమావరపారిజాతః
శ్రీ వేమభూమి రమణో జగదొబ్బగండః,
శ్రీ ఘోడరాయ గురువర్య దయావిశేషా
త్పృథ్వీం ప్రశాస్తి సకలామకలంకవృత్తిః

హేమాద్రిణా నిగదితాని గురూపదేశాత్
దానవ్రతాని సుమహాంత్యపి యశ్చకార
దత్వాయశోద్భుతతరం సకలద్విజేభ్యః
శివాందయః పృథుయశాః స్వయమన్వభుక్ష

పాతాళగంగామధికృత్యకృతాం
శ్రీపర్వతాగ్రాదవరోహణాయ,
సోపానపంక్తిం కృతవాన్మహాత్మా
కల్యాణశైలం స్వయమారురుక్షుః 1

ప్రోలయవేముని యీ ధార్మికకృత్యములు, అతని తరువాతి రెడ్డిరాజులు నిర్మించిన దాన శాసనములందుఁ దఱుచుగఁ బేర్కొనఁబడుచునే వచ్చినవి. ప్రోలయ వేముని శౌర్యము ధర్మనిరతియు నీతని తరువాతి రెడ్డిప్రభువుల కాదర్శప్రాయమై వెలసినవి. ఈతని కుమారుఁడగు అనవేమారెడ్డియు నీతనివలెనే మహావీరుఁడు, పరమధార్మికుఁడు విద్యాపోషకుఁడునై [illegible]కుఁడు. అనవేముని వదాన్యత సర్వాంధ్రదేశ ప్రసిద్ధమై పండిత రసనారంగముల నాఁటికి నేఁటికిఁ బాయక నిలిచియున్నది. ఈతని శౌర్యము కాటయ వేముని కొమరగిరి శాసనమునం దిట్లు వాకొనఁబడినది.

శ్లో. యస్యాస్తాం విజయే సమస్తవిదితా శ్రీశైల
సింహాచలా
స్తంభౌ పశ్చిమపూర్వదిగ్విజయిన వ్యాఖ్యాత
వైజ్ఞానికా 2

ఈ శ్లోకమునుబట్టి యనవేముఁడు శ్రీశైల వింధ్యాచలములను పశ్చిమ పూర్వదిశలందు విజయస్తంభములుగాఁ జేసి, తన్మధ్యాంధ్రదేశమును దనవశము గావించి పాలించెనని తెలియవచ్చుచున్నది.

ప్రోలయవేముని దౌహిత్రుఁడగు కాటయ వేముఁడు విజయసాధనమున శౌర్యాటోపమున ధర్మనిరతిని అగ్రహారాది దానమున సర్వథా మాతామహుని బోలినవాఁడు. ఈ విషయ మంతయు కాటయవేముఁడు గోదావరీమండలమున వెలయించిన దానశాసనములవలన స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. మాతామహునికంటెను గూడ నీతని కొక విశిష్టత గొని తెచ్చిపెట్టిన దీతనికిఁ గల సంస్కృతభాషా పాండిత్యము. రాజరాజనరేంద్రుని తరువాతి రాజమహేంద్ర

1 చూ రెడ్డిసంచిక అనుబంధము 1 శాసనము.

2. See J A H R S Vol XI P P. 209

నగరము రాజధానిగా నాంధ్రదేశపాలనము మరల నతని చేతనే కొనసాగినది.

ప్రోలయ వేముని వాఁడును, అతని జ్యేష్ఠపుత్రుఁడైన యనపోత రెడ్డిగారును కొండవీటి సామ్రాజ్యము కృష్ణానదీ పరిసరములందె సీమితమైయుండెను. అనపోతుని తరువాతి కొండవీటి రాజ్యసింహాసనాధ్యాసి యైన అనవేమారెడ్డి, గోదావరీ పరిసర దేశమంతయు జయించి, రాజ్యసీమను ప్రాగుత్తరముగా సింహాచలము వఱకు వ్యాపింపజేసెను. అనవేముఁడుభయ గోదావరీ తీర పరిసర దేశమంతయు జయించినట్లు నాతఁడు దక్షారామాది ప్రదేశముల నెలకొల్పిన శాసనములబట్టియు, ఆయా యా తీరములందు వెలసిన వేమవరాగ్రహారముల బట్టియు దెలియవచ్చుచున్నది. మఱియు శ్రీశైలమున మల్లికార్జునస్వామి యాలయమునకు వీరశిరోమంటపము నిర్మింపజేసి, వెలయింపజేసిన శాసనమునందలి బిరుదావళిలోని "సింహాచలాది వింధ్యపాదప్రతిష్ఠాపిత కీర్తిస్తంభ, సం[సా]గర గౌతమీ [సంగమ] సకల జలదుర్గ సాధన రఘురామ, రాజమహేంద్రనగర నిరవద్య నగరాది బహువిస్తృతదుర్గ విదళన బలరామ[3]" ఇత్యాది విశేషణములచే నితఁడు గోదావరీతీర దుర్గములను జయించి, కొండవీటి రాజ్యమును సింహాచలమువఱకు పొడిగించెనని నిర్ధారితమగుచున్నది. అనవేముని తరువాత కొండవీటి సామ్రాజ్యపాలకుఁడుగా కుమారగిరి వచ్చినప్పుడు, అనవేముని నాఁడు విస్తృతమైన రాజ్యసీమ లన్నియు వారిని యేలుబడిలో చెల్లునటుల చేసినవాఁడు—ప్రోలయ వేముని దౌహిత్రుఁడు, అనపోతా రెడ్డి యల్లుఁడు, కొమరగిరి సోదరీ భర్త, చతుర్విధోపాయనయప్రవీణుఁడు, సామ్రాజ్య నిర్వహణ దక్షుఁడు మహామాత్యుఁడు ప్రధాన సేనానియు నగు కాటయ వేమారెడ్డియే.

కాటయ వేముఁడు కుమారగిరి భూపాలుని సింహాసనమున గూర్చుండబెట్టి శ్రీకృష్ణుడు ధర్మజునివలె వన్నెకెక్కించెనని, కాటయ వేముని గోవరము తొత్తరమూడి శాసనములలోని యీ క్రింది శ్లోకము తార్కాణించుచున్నది

శ్లో॥ సింహాసనే విధాయాసౌ కుమారగిరిభూభుజమ్
అతేజయ న్మహోతేజా శ్రీకృష్ణ ఇవ ధర్మజమ్[4]

కాటయ వేముని రాజనీతి చతురత బాహుపరాక్రమము మహోన్నతములని యీ క్రింది శ్లోకములవలనఁ దెలియుచున్నది

శ్లో॥ ఆసీ దమాత్యరత్నం కాటయవేమ ప్రభు స్తస్య
అతి సురగురుభార్గవ మతి రతిభార్గవ విజయ
విఖ్యాతిః[5]

శ్లో॥ పల్వలపంచక మకరోత్ క్షత్రీన్ నిక్షిత్య వైరిణో రామః,
వైరికుల పరసురామః కాటయవేమసు కీర్తివా రిశితమ్[6]

కుమారగిరికి కాటయవేమ ప్రభువు ప్రధానామాత్యుఁడు. ఈతఁడు బుద్ధి విభవమున బృహస్పతి శుక్రులను, విజయములు సాధించి విఖ్యాతి గాంచుటలోఁ బరశురాముని మించినవాఁడు. పరశురాముఁడు యుద్ధములందు శత్రువులను జయించి పల్వల పంచకమును (ఐదు మడుగులను) గావించెను. శత్రుకుల పరశురాముఁడైన కాటయవేముఁడు వందలకొలఁది కీర్తి సముద్రములను నిర్మించెనని విశేషము. కాటయవేముఁడు తన బుద్ధిబలమున రాజనీతము లన్నియు నెరిగియుండి, బాహుబలమున నపరిమిత శత్రువము నణఁచుచుండ, వారిని కేలికరైన కుమారగిరి వసంతోత్సవము సల్పెను, నాట్యాభినయ ప్రదర్శనముల తోడను, నవ వసంతాభ్యుదయ ములతోడను నానందముగఁ గాలము గడుపు భాగ్యముఁ బడయఁగలిగెనని, కాటయ వేమ విరచిత మాళవికాగ్నిమిత్ర నాట్యవ్యాఖ్యానము నందలి యీ క్రింది శ్లోకము తార్కాణించుచున్నది

శ్లో॥ భాగ్యం నామ సమగ్ర మీదృశ మతి స్నేహైక పాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధతరిపు వ్యాంసే నియోజ్య స్వయమ్,
నిత్యం నందతి నర్తకైః రభినవైః కాంతై ర్వసంతోత్సవై
స్సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో నృపాలోత్తమః,

కాటయ వేముఁడు కుమారగిరిని దన కేలికగా భావించుచు, వారినియెడఁ గృతజ్ఞత గలిగి యాతని యాజ్ఞను శిరసావహించుచు, వారిని పక్షమున విజయములు సాధించుచు డెసెవాఁడెను విషయమును అని

---

3 See S I I Vol x No 509

4 J A H R. S Vol XI

5 Epi Ind Vol IV P P 318 to 327

6. అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్య కుమారగిరి రాజీయము.

దాడివసెలి వచ్చి, రాజమహేంద్రవరమున నిలిచి, యచటనుండి ముందునకు సాగి విజయమును సాధించి నట్లు అనవర్తి శాసనమే తెలుపుచున్నది. మఱియు నానాంటికి రాజమహేంద్రవరము కొమరగిరిపాలనము నందె యుండెనట్లు క్రింది శాసన శ్లోకములు వివరించు చున్నవి

శ్లో॥ తతశ్శైలపురాధిపస్య కుమారగిరి భూపతేః
రమ్యం రాజమహేంద్రాఖ్య నగరీం
ప్రతిష్ఠ పవ్యాత,
తతస్సింహాద్రి వింధ్యాద్రి మధ్యవర్తి
మహేశ్వరాన్
జిత్వా తద్దేశగురేషు నియుక్తస్వాధికారిణః

కాటన వేముఁడు కొండవీటినుండి బయలుదేరి, కొమరగిరికిఁ జెందిన రాజమహేంద్రనగరమును జేరి, యచటనుండి దండుదివెలి వింధ్యపర్వత సింహాద్రుల మధ్యగులయిన మహీశులను జయించి, యాయా దుర్గములందు దన యధికారులను నియమించి యుపారములతోఁ గూడిన విజయమును కొమరగిరి కర్పించెననిన నీతచ్ఛాసన విషయము ఈ తీరున వేముఁడు జయించిన దుర్గము లేవియో యీ శాసనమున నిరూపింపఁబడియుండలేదు గాని, కాటయ వేమ విరచితమైన అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యానమునందు క్రింది విధముగ వివరింపఁబడినవి

శ్లో॥ ధాటీఘోటిఖురాగ్రకృత్త గిరితటే
యాత్రి మొల్లేటి దుర్గం
దుర్గం కిమ్మూరి సంజ్ఞం దళితరిపుబలే
దుర్గమం కొంపెపూండిమ్,
దుర్భేదం వజ్రకూటం జరితవతి రథినా
రామగిర్యాఖ్య దుర్గం
విఖ్యాతం వీరఘోటం గళిత మనువ్యారాం
వీరసన్నాహథాస్థైర్యమ్

కాటయ వేముఁ డిట్లు సైన్యముతో దాడివసెలి గిరితటములఁ బిండిసేయుచు, మొల్లేరు, కిమ్మూరు, కొంపపూఁడి, వజ్రకూటము, రామగిరి, వీరఘోటము అను దుర్గములఁ జయించి శత్రువుల శౌర్య సన్నాహము నణఁగించెనని దీని భావము ఈ దుర్గము లన్నియు కొండవీటి ప్రాగ్దేశములోనివి వివిలో —

కొంపపూఁడి — ఇది పిఠాపురమున కుత్తరముగ నేడుక్రోసుల మేరలో, అన్నవరక్షేత్రమునకు ఒక క్రోసు తూర్పుననున్నది అచట శిథిలమైన దుర్గ మొకటి నేఁటికినిగలదు

వజ్రకూటము — ఇదియును పిఠాపురమునకు వాయవ్యముగ నెనిమిది క్రోసుల మేరలో నున్నది. అచటను దుర్గశిథిలములుగలవు ఇది నేఁడు పిఠాపురమున కంకాయలఁ బ్రసిద్ధివహించియున్నది. వజ్రకూటపు వంకాయలని నేనుమంగారు

వీరఘోటము — దీని నేఁడు 'వీరఘటము' అని యందురు ఇది శ్రీకాకుళముజిల్లాలో పాఁకొండకు సమీపమునందున్నది ఇది నేఁడు అడాకులకుఁ బ్రసిద్ధిగాంచియున్నది

మొల్లేరు — ఇది నేఁటి తూర్పుగోదావరిజిల్లా ఎల్లవరము తాలూకాఁ జెందిన గ్రామము ఈ యూరఁ గాటయవేమునితోడి సంబంధముగల శాసనము గానవచ్చినది 10

కిమ్మూరుదుర్గము — ఇది యీ జిల్లాలోని పెద్దాపురము తాలూకాఁ జెందినది పెద్దాపురము తాలూకాలోని కొన్ని గ్రామములకు కిమ్మూరుసీమ యని పేరు ఈ తాలూకాఁ జెందిన జగ్గంపేటయను గ్రామమునకు సమీపమున కిమ్మూరు అచ్యుతపురమను గ్రామముగలదు దాని దాపున కిమ్మూరుదుర్గమని వ్యవహరింపఁబడు ప్రదేశముగలదు దుర్గప్రదేశము చాలభాగము సాగుబడిలోనికి వచ్చినను దాని కొంతభాగము నిలిచియేయున్నది దుర్గశిథిలములుకూడ గానవచ్చును.

రామగిరిదుర్గము — ఇది రాజమహేంద్రవరమున కుత్తరముగ పదిక్రోసులమేరలో, అచటి గోదావరీతీరమునంటియున్న రెడ్డిపోలవరమున కొండయొద్దను మూఁడు క్రోసుల మేరలోనున్నది ఇది గిరిదుర్గము జలదుర్గము కూడనైయున్నది ఇది నేఁటికిని దుష్ప్రవేశస్థితియందే యున్నది ఇది కాటయవేముని వాఁడు అన్నదేవచోడుని రాజధానియై యుండెనో పురాణ పటిష్ఠక్షేత్రమున కిది నాలుగు క్రోసులమీఁద నున్నది. ఈ జలదుర్గమునం దొక పెద్ద పద్మాకరము గలదు.

ఈవిధముగఁ గాటయ వేముఁడు రాజమహేంద్రవరమాదిగ సింహాచలమునకును నుండిన దుర్గములను జయించి విజయము సాధించెనని యూహింపవచ్చును.

---

10. See S. I. I vol X No 578.

వారి కొమరగిరిపురం, ముండెఱ రామనాథ సోమ యాజులవారి రుద్రభట్లు మూగభట కొమరగిరిపురం, గ్రామాగ్రణుల కొమరగిరిపురం, అన్నదానం అవుభళేటుంగారి రాఘవంగారి కొమరగిరిపురం వలపతల్లి అన్నభళిభట కొమరగిరిపురం, [శ్రీ] హారం తిరఘుంట శ్రీ గిరన్నంగారి కొమరగిరిపురం, వివపాల పె[ద] కొమరగిరిపురం కొమరగిరిపురం పోతరాజు వారి కొమరగిరిపురం, వుతాయపెటె [లిన] కొమరగిరిపురం, పుంగ్రాజావారి తిల్లా [ప్రె] గడ కొమరగిరిపురం, వేదాద్రి శ్రీ నరసింహ్మస్వర కొమరగిరిపురం, కూచిరాజు తిప్పనంగారి కొమరగిరిపురం, ఆరాధ్యుల మల్లనంగారి కొమరగిరిపురం, చేయేటి శ్రీ శేశనాగరి కొమరగిరిపురం, కొకొండ శ్రీ నరసింహ్మస్వర కొమరగిరిపురం, రెండు ఆపోతిసిష్ఠుల కొమరగిరిపురం, కాయారి సోమయాజులువారి మలుభట కొమరగిరిపురం, లింగాయ పండితులవారి విశ్వనాథ పెమ్మన కొమరగిరిపురం, సిద్దాయ పండితులవారి అన్నా పండితుల కొమరగిరిపురం, పంటలారి శ్రీ గిరగయ్యంగారి దేవులైన మల్లాయాంమంగారి పనపుకిచ్చిన కొమరగిరిపురం, మైలార గేవరకొమర గిరిపురం మూలం గూరంమ కొమరగిపురం

లింగాయ పండితుల [త్రి]యా పండితులవారి అనవేంతరము, అకుల పెద్దిభట్ల వారియా [రి మంచ మారవర ] [కొట] మ రెడి వేంబరం, దేవన్నాయాంగారి ప్రతాప అన్నవరం, మాడెము రమణా [థ] సోమయాజుల నాగిపెద్దవరం, వంకేశ్వల శేశిగజవర వేంతగం, పెన్నవరం, పిరవరం, ప్రపన్న శ్రీపాదాల శ్రీ లక్ష్మీనరసింహ్మపురం

కొటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధంగలక్ష్మి [అ] ఇ ఆ కొమరగిరయ్యంగారి ఇ కొమరగిరయ్యంగారై అవతరించిన [ఇ] కొమరగిరయ్యంగార్కి తల్లింగారైన తల్లసానం మంగారు ఇ కొమరగిరయ్యంగారికి [న్ని] కొటమరెడ్డి వేమారెడ్డింగార్కిన్ని సుకృతముగాను శ్రీ గౌతమీ తీరమందును వేదాద్రి శ్రీ నరసింహ్మ దేవునకు ప్రతి సంవత్సర తిరునాళ మహోత్సవానకు ధారవోసి సమర్పణచేసిన వెలుమూరి తల్లవరము కొటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగలక్ష్మి అ ఇన మల్లసానం మంగారు కొటమరెడ్డి వేమారెడ్డింగార్కిని స్వామి అ ఇన కొమరగిరయ్యంగార్కిన్ని గారి దేవులైన అనుంగాంబలక్ష్మి అత్తయ సుకృతము ఇ అట్లుగాను మకర సంక్రమణ పుణ్యకాలమందు రాజమహేంద్రవరానను శ్రీ గౌతమీ తీరమందు మార్కండేశ్వర దేవరకు పహిండి సమర్పించి, మార్కండేశ్వర దేవరకు నిత్య అవసరాలకు ఇచ్చిన మల్లవరము 11

ఈ యుదహోబల శాసనము కొటయవేముని దయావర్తకు సుకృతాన దృష్టికి కృతజ్ఞ భాగములకు నిదానము ఈ శాసనమున పేర్కొనబడినవానిలో పెటె అనులాపురము కొలూకొకు చెందిన కొమరగిరిపట్నము మరనుళ్ళ పిఠాపుగానకు చెందిన కొమరగిరి, సర్పవర భావనారాయణస్వామికి చెందిన పిఠాపురమునకు సమీపమునయున్న గోరస కొమరగిరియు నా పేర్లతో నిలిచియున్నవి మిగిలినవాని పేర్లు నివనచ్చుటలేదు మొత్తము మీద రాజమహేంద్రవర రాజ్యమునకు కలసైనదిగా వారి గాటయవేమునకు గోదావరీతీర భూములందు పెక్కు గ్రామములు ధారవోసి యిచ్చి తన ధార్మికతను సుస్థిరము చేసియున్నాడు ఈ శాసనము వలనలి ముదివాక్యములనుబట్టి కొటయవేమునకు తల్లాంబిక మల్లాంబిక యను నిద్దరు భార్యలుండినట్లు తెలియవచ్చుచున్నది వీరిలో తల్లాంబికయే కొటయవేమునకు పుత్రుండై జన్మించిన కొమరగిరికి తల్లియని యీ శాసనము స్పష్టము చేయుచున్నది వేముని కవితల్లి యను పుత్రిక కలదు కొటయవేమునకు కైక పుత్రుడగు కొమరగిరి మరణించినపిమ్మట, కొటయవేమునకు దిగంతులైనపిదప రాజమహేంద్రవర రాజ్య మీయనితల్లికి సంక్రమించినది ఈయనితల్లిగన్న తల్లి రెండవా ? యనునది సంశయాస్పదముగ నున్నది ప్రోలయవేముని కొడుకు అనవేమునియిట్లు, తల్లాంబిక కూతురనితల్లి రెండవా ? లేక మల్లాంబిక కొమరగిరి సోదరియై తత్పరతయుటచే అనితల్లికి రాజ్య సంక్రాంతి గలిగెనా ? దీనిని నిర్ణయించు శాసనాద్యాధార మేదియు నింతవరకు బయలుదేరి యుండలేదు

ఇది యిట్లుండ అనితల్లి కలువచేరు శాసనములో అనితల్లికన్న తల్లి దొడ్డాంబిక యనిపించు శ్లోకమొకటి యీ తీరుగ నున్నది.

శ్లో॥ యస్యా వేమ నృపాలోజనకో దొడ్డాంబికా తు జననీ శ్రీ
సా దీనయిత్యనితల్లి సహో దరి రిత దేవభూమినేత్రః॥

11 see. s i i. vol x No. 577.

# కాటయ వేమ భూపతి

ఈ శ్లోకములకు యథాస్థితముగా నర్థము చెప్పుకొనినచో, ఎఱ్ఱకు వేమభూపాలుడు తండ్రియో, దొడ్డాంబిక తల్లియో, అయితల్లి అన్నది దాక్షిణ దేశ భూదేవలక్ష్మీకరలె దేజరిల్లుచున్నదని యర్థము చెప్పవలెను. దీనిని బట్టి దొడ్డాంబిక యా పెద్దదియనవలెను. కాటయ వేమునకు తిల్లాంబిక మల్లాంబిక లిరువురు భార్యలై యుండినట్లు అహోబల శాసనము తొత్తరమూడి శాసనము తార్కాణించు చున్నవి. వారి యిరువురిపేర తిలకరము మలకరము అను గ్రామములు దానముచే యబడినట్లు ఆ శాసనములు నిరూపించుచున్నవి. వేమునకు దొడ్డాంబిక యను భార్యకూడ యుండినట్లు లీయుక్క శాసనమునే గాక మఱొక్కడను నా విషయము తెలుపబడియుండలేదు. కాని కాటయ వేమునితల్లి, ప్రోలయ వేముని కూఁతురు, అనపోతారెడ్డి సోదరియునగునామె 'దొడ్డాంబిక' యని బహుశాసన ప్రసిద్ధము. ఈ విషయమును గ్రుసకముచేయు నీక్రింది శ్లోకము వేముని పెక్కు శాసనములలో గానవచ్చుచున్నది.

శ్లో॥ నష్టాకాటమహీభుజో, గుణగణోదారస్వరూప ప్రభోః
పౌత్రః, కాటయవేమ భూమిరమణః శ్రీ వేమ పృథ్వీపతేః
దౌహిత్రః, ప్రనరన్నపోతనృపతే ర్భ్రాత్రీశ చూడామణే
ర్జామాతా జయతి క్షితౌ చిరమసౌ దొడ్డాంబికా నందనః 12

ఈ శ్లోకమునుబట్టి కాటయవేముఁడు దొడ్డాంబికా కుమారుఁడనుట నిర్వివాదవిషయము కావున పైకలువచేరు శాసన శ్లోకమునకు "ఎఱ్ఱనికి దొడ్డాంబికతల్లియో" యనుటే కాటయవేముఁడు జనకుఁడుగాఁగలయని తల్లియని యర్థము చెప్పవలెనుగా! లేక లేఖక ప్రమాదమున నీ శ్లోకమున 'తిల్లాంబికా, లేక మల్లాంబికా' యనుటకు బదులుగా 'దొడ్డాంబికా' యయినదా! యను విషయమింతవరకు నిశ్చయించుటకు వీలుపడదు. చరిత్రకారులు మాత్రము కలువచేరు శాసనమును సర్వధా ప్రామాణ్యము నంగీకరించి, కాటయవేమునకు మూడుగురు భార్యలనియు, వారిలో దొడ్డాంబిక కొమరగిరి సోదరియనియు, తత్పుత్రియగుటచే అనితల్లికి వేమునిరాజ్యము సంక్రమించెననియు వ్రాసి యున్నారు. కాని యీ విషయము స్పష్టముచేయు శాసనాధారమేదైన క్రొత్తగ నుపలబ్ధమగునంత వఱకు నిట్టియూహ పరిగ్రాహ్యమని చెప్పఁ బోవుటలేదు.

రాజమహేంద్రవరరాజ్యమును, కాటయ వేముని తరువాత నాతని వంశాంకురమై నిలిచి, రాజ్య సంక్రాంతికి దాయార్హతగలది అనితల్లి యగుటచే, నామెకు మామగారగు అల్లాడరెడ్డి యామెకు రాజ్యమును సంక్రమింపఁజేసెనని యీ క్రింది శాసన శ్లోకములు నిరూపించుచున్నవి

శ్లో॥ దురిత రహిత చిత్తో దొడ్డ అల్లాడ భూపో
భువనమరి జనవర్ణ్యం భూయసాపార్తిత్వ దోష్ణా,
విమలగుణయుతాయాం వేమ భూపాత్మజాయా
మనిని సురగుధాయా మన్నితల్ల్యాం వ్యధత్త 13

గతే దివం కాటయవేమభూపే
నిర్మూల్య భక్త ద్రోహికులం సమస్తం,
అదందల శ్రీక మహా తనోతి
తత్పుత్రికే రాజ్య మరాతిశ్వన్యమ్ 14

కాటయ వేముఁడు తూర్పుబాటి దురవిజయమునకు బయలుదేరినప్పు డాతని వెంటవచ్చిన సేనాధిపతులలోఁ బ్రధానుఁడు, కొండవీటి ప్రభువుతో బాంధవము కలిగియున్న రెడ్డినాయకుఁడు అల్లాడ రెడ్డి. ఈతఁడు కాటయ వేముని యీ విజయయాత్రలో నాతని కండదండయై నిలిచినవాఁడును నాతనితో విశ్వాసముండినవాఁడును. కాటయ వేముఁడు తన కూఁతులలో హరిహరాంబను అల్లాడరెడ్డి సుతులలో జ్యేష్ఠుఁడైన వేమునకును, అతని ద్వితీయ సుతుఁడైన వీరభద్రారెడ్డికి అనితల్లిని నిచ్చి వివాహము చేసెను. తమ్ముల కముగఁ గాటయ వేముని రాజ్యము ననితల్లికి సంక్రమింపఁజేయుపని విశ్వాసుఁడైన అల్లాడ రెడ్డిపైఁబడినది. హరిహరాంబయుఁ గాటయ వేముని పుత్రియై యుండ, అనితల్లికే కాటయ వేముని రాజ్యమును సంక్రమింపఁజేయుటకుఁ గారణ మామె కొండవీటి ప్రభువులకు దౌహిత్రియై యుండుటయే గావలయును. లేకున్న కాటయ వేమునకుఁ బుత్రియైన హరిహరాంబకో రాజ్యమేల సంక్రమింపరాదు! కాటయ వేముఁడు దివంగతుఁడైనంతనే, రాజమహేంద్రవర

---

12. చూ. కొమ్మవరము, గోపవరము, తొత్తరమూడి శాసనములు
13 చూ. అనితల్లి కలువచేరు శాసనము.
14. See. S. I. I. vol V No 118.

శ్రమవంతుఁడో అంతటి సంస్కృత పాండిత్యము గల వాఁడు. ఈతని వైదుష్యము కుమారగిరి యొనర్చిన వసంత రాజీయోక్తమార్గమున నాట్యశాస్త్ర సమన్వయము చేయుచు రచించిన కాళిదాస విరచిత రూపక త్రయ వ్యాఖ్యానము లందును కుమారగిరి రాజీయములందును గానవచ్చును ఈతని వైదుష్యమును గూర్చి శ్రీ వీరభద్ర రెడ్డి సంచికలో 'కాటయవేముని వైదుష్యము' అను వ్యాసమునఁ గొంత తెలిపియుంటిని 15

కాటయవేముఁడు కవిసమ్రాట్టైన కాళిదాస విరచిత దృశ్యకావ్యములు మూఁడింటికి వ్యాఖ్యానము రచించి యుండుటచేతనే, మల్లినాథసూరి శ్రవ్య కావ్యములకు మూలంకషముగ వ్యాఖ్యరచించి దృశ్య కావ్యములకు వ్యాఖ్య రచించుట మానినాఁడు. వేముఁడు కుమారగిరి యాశ్రితుఁడు, వారియెడఁ దనకుఁగల కృతజ్ఞత వెల్లడించుచును, తద్విరచిత వసంత రాజీయాభిధానముతో లక్షణసమన్వయము చెప్పుచుఁ గృతిని రచనమునకుఁ గైకొనుటచే, నీతని వ్యాఖ్యలవలనఁ గుమారగిరి పాండిత్యముతోఁ బాటు జిజ్ఞాసువులకు విదితమగుచున్నది. ఏయే కవులందు భరతాది ప్రాచీన నాట్యశాస్త్రవిషయములకు లోఁగని యంశము లుండునో యట్టి కవులందే వసంతరాజీయోక్త పదతిని నాట్యశాస్త్ర సమన్వయము గావింపఁబడినది. కాని యొకానొకచో లక్షణము సర్వథా సంశయ నిశ్చితముగాకున్న వ్యాఖ్యానము చేయు పద్ధతిలోఁ గాటయవేముఁ డంగీకరించిన పద్ధతి సర్వదా సముచితముగానుండెను. ఈతని వ్యాఖ్యలందలి విశిష్టతను గూర్చియు వసంతరాజీయవిశిష్టతను గూర్చియు మఱియొకప్పుడు నా యెఱుకకొలఁది వివరింప బ్రయత్నింతును

15 మా రెడ్డి సంచిక పుట ౨౮౮ ౨౬౬

# అంతర్వాహిని

## హితశ్రీ

* గతసంచిక తరువాయి *

**12**

విశ్వం హైదరాబాద్ నుంచి తిరిగివచ్చాడు బండి దిగగానే ఎదురుగా వొచ్చాడు గోపీ. తనకు దమ్ము ఉన్నవాళ్లు ఎవరొచ్చినా గోపీకి అలా ఎదురురావటం అలవాటు. విశ్వం అది చాలాసార్లు గమనించాడు. అయితే అలా ఎదురురావటమనేది అందరిపట్లా సర్వసామాన్యమే. తనూ తెలిసినవాళ్లొస్తే ఎదురువెళతాడు. కాని తనలాంటి పెద్దవాళ్ళు అలాచేయటంలో పుత్రవాడైన గోపీ అలాచేయటంలో తేడావుంది వరం వాళ్లలో తీరికగా కూర్చొని కబురు చెప్పుకుంటున్నప్పుడు విశ్వం గోపీని అడిగాడు. "వాళ్లలో బండిదిగి చుట్టా తెలిసినవాళ్లొస్తున్నప్పుడు ఎదురువెళ్లటం దేనికిరా గోపీ, వాళ్లెలాగూ ఇంట్లోకి వస్తారుగా"

గోపీ ఆ ప్రశ్నకి తెల్లబోయాడు. ఏం సమాధానం చెప్పాలో వాడికి తెలియలేదు.

"ఊరికే" అన్నాడు

"మర్యాదకోసమా?"

గోపీ అర్థభారం చదువుతున్నా అది ఈడుకి మించిన చదువు. వాడికి ప్రశ్నలోని భావం సరిగా అంతుకాదని విశ్వానికి తెలుసు "ఊఁహుఁ" అన్నాడు గోపీ ప్రశ్న అర్థమైనట్టుగానే

"వెళ్లాలనిపిస్తుందా?"

అవునన్నాడు గోపీ. ఎందుకనిపిస్తుందో వాడికి తెలియదు వాడు ఆలోచించివుండలేదు. కాళ్లు లాక్కుపోతాయి, అంతే

విశ్వం ఆలోచించాడు. తనలా ఎదురువడితే ముఖస్తంగా మర్యాదకోసం చేసేవాడు. మనస్సు హెచ్చరిస్తుంది. పసివాడికి ఆహెచ్చరికే ఏం లేదు. పరిచయస్థుల్ని చూడగానే హృదయంగరి సాంగత్యం ఏదో ఆత్మీయంగా వాడిని అలా లాక్కుని వెడుతుంది.

ఇది పైకి చాలా చిన్న విషయంగానే కనిపించినా ఇందులో గంభీరభావం ఏదో ఇమిడిఉన్నట్టనిపించింది విశ్వానికి. అన్నిసార్లు గోపీ తన బండిదగ్గిరికి పరిగెత్తుకుని వచ్చినా తనా విషయం గురించి ఈరోజులాగా ఆలోచించినట్లు ఆలోచించలేదు పూర్వం ఎన్నడూ. ఈసారి గోపీ అలా రావటం చూడగానే తనకీ ఊహ ఎందుకు కలిగిందో!

కొంచెంసేపాగి విశ్వం అడిగాడు.

"గోపీ, నువ్వెరిగిన వాళ్ళందరిలో ఎక్కువ మంచి వాడెవరు?"

"రంగారావు మాస్టరుగారు" తడుముకోకుండా చెప్పాడు వాడు

"ఎందుకూ?"

గోపీ ఆలోచించాడు

"ఏమో" అన్నాడు చివరికి

రంగారావు మంచివాడే అయితే గోపీమాస్టరులో అంత మంచివాళ్లు ఇంకా ఉన్నారు. కాని వాడికి రంగారావంటేనే అభిమానం ఎందుకో? ఆ విషయం వాడికే తెలియాలి

"అందరిలోకీ ఎవరంటే నీకిష్టం?"

గోపీ కొంచెం ఆలోచించి అన్నాడు.

"అక్కయ్య"

"ఎందుకు?"

ఈసారి సమాధానం వాడికి తెలుసు. సైకిల్కి చక్కనప్పుడు రైలు కదుల్తుంటే అక్కయ్య దూరమవుతుంటే వాడికి కన్నీళ్ళుతిరిగాయి, అక్కయ్యకీ తిరిగాయి. వాడికి అక్కయ్య కావాలనిపించింది. వాడి ఆలోచనలు ఆమెవైపు మరలాయి. జవాబివ్వటం మర్చిపోయాడు. విశ్వం అది గమనిస్తూనే ఉన్నాడు. వాడి మనసులో ఏ మూలో కూడా అతనికి తెలుసు.

విశ్వం ఆలోచనలోపడ్డాడు. కొన్ని విషయాల

# అంతర్వాహిని

కేవలం తార్కికంగా ఆలోచిస్తే తేలదు కావచ్చు. ఆ అవసరం కూడా లేదేమో. హృదయంలోని ఏవో అనుభూతులు మన ప్రవర్తనకి కారణ మౌతాయి కొన్ని సమయాల్లో. అది హేతుపూర్వకంగా ఉండక పోవచ్చు. సమర్థనీయం కూడా కాకపోవచ్చు. కాని హృదయంలోని ఆ అవ్యక్త భావాలని కాదనటానికి వీల్లేదు.

డాక్టర్ ప్రవర్తన గురించి తను సందేహంగా చెప్పినప్పుడు ఆమెలో కలిగిన ఘోరణి తనుమర్చి పోలేదు. ఆమె ఆలోచించటం మానేసింది. హృదయం మూగగా ఏదో పలికింది. లేకపోతే ఆమె అలా ఆవేశంగా మాట్లాడి ఉండేదు. ఆక్షణంలో తన హృదయం స్పందించింది. అంతగా హృదయాన్ని ఊపి వేయగల సన్నివేశం తన జీవితంలో ఇంతవరకు జరగలేదు. పద్మ వ్యక్తిత్వం తనకిప్పుడు అర్థమవుతోంది. అంతగా తన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోడంవల్లే డాక్టర్ మీద ఇతర్ల అభిప్రాయాల్ని తృణప్రాయంగా చూసి ఉదాత్తంగా వ్యవహరించగలిగింది. పద్మలా ఎంతమంది ఉంటారు!

కాసేపు అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు విశ్వం. ఆలోచనల్లో వసంత జ్ఞాపకం వచ్చింది. పదిహేను రోజులైనా అయివుంటుంది తనామెను చూసి. బజారికి వెళ్ళి కాస్త కాఫీతాగి అలా వసంత ఇంటికి వెళ్లాలనుకున్నాడు విశ్వం. కాని ఇంతలో మనసు మార్చుకున్నాడు. రైల్లో నిద్రలేక కళ్ళు బరువుగా వున్నాయి. సాయంత్రం వెడితే ఖులాసాగా ఉంటుం దనుకున్నాడు.

సాయంత్రం కాగానే ఆకాశంలో మబ్బులు అలుముకో సాగాయి. సన్న జల్లుకూడా ప్రారంభ మయింది. అయినా విశ్వం బయల్దేరివెళ్లాడు. తలుపు తట్టబోయేసరికి అతనికి లోపలనించి ఏవోమాటలు విని పించసాగాయి. ఆగాడు. మాటలు రానురాను స్పష్టంగా వినిపించసాగాయి. వసంత కంఠం తీవ్రంగా వినిపిస్తోంది. ఉన్నట్టుండి చెంప ఛెళ్ళుమన్న శబ్దం విని పించింది. దడాలున తలుపు తోసుకుని లోపలికి అడుగు పెట్టాడు విశ్వం. దండకొడితే భుజంగంలా ఉంది వసంత. పక్కన వెంకటేశ్వరరావు కందగడ్డలాంటి వదనంతో నుంచున్నాడు. చప్పుడు విని ఇద్దరూ తలుపు వైపు చూశారు.

"ఏమైంది?" అన్నాడు విశ్వం ఇద్దరివైపూ చూస్తూ.

వెంకటేశ్వర్రావు ముఖం మరింత ఎఱుపెక్కింది.

"చెయ్యి పట్టుకున్నాడు దుర్మార్గుడు," అంది వసంత కోపంతో.

"ఎత్రువత, పాపం" అన్నాడు వెంకటేశ్వర్రావు హేళనగా.

"షటప్" అన్నాడు విశ్వం వొళ్లుమరిచి.

"విశ్వంగారూ, మర్యాద ఇచ్చి పుచ్చుకోండి. మీకు పరిస్థితులు తెలియవు. ఎంతసేపూ తగలేశారో, భవానీ కేంగుడిలా."

"ఎవరికి?" అంది వసంత రెట్టిస్తూ.

"చెప్పాలా?"

"నేను మీ బహుమతి ఒక్కటికూడా ముట్టుకో లేదు. ఎప్పటికప్పుడే తిరగొట్టినా సిగ్గులేక" వసంత పూర్తిచెయ్యలేదు.

"మీవాళ్లకిస్తే ఒకటి నేనిస్తే ఒకటేనా?"

"నాకు వాళ్లతో సంబంధం లేదు"

వసంత కళ్లలో నీళ్లు తిరిగాయి.

"ఇదేనా మీ నాటక కళోపాసన?" విశ్వం వెంకటేశ్వరరావు వైపు అసహ్యంగా చూస్తూ అన్నాడు.

"మీ చిత్రకళోపాసన సంగతేమిటో!"

విశ్వం నిరుత్తరుడయ్యాడు ఒక్కక్షణం.

"గురువింద గింజ తన నలుపెరగదట!"

"ఇకనేం దౌర్జన్యాలు చెయ్యలేదు. గెటౌట్" గట్టిగా అరిచాడు విశ్వం.

"తమరే దయచెయ్యండి" అన్నాడు వెంకటేశ్వరరావు వ్యంగ్యంగా.

విశ్వం చెయ్యి చేసుకోటానికి సిద్ధమయ్యాడు.

"సిద్ధమే"

వసంత కలగజేసుకుంది.

"వెంకటేశ్వరరావుగారూ, మా ఇంట్లోనుంచి వెళ్ళి పొమ్మంటున్నాను. పెద్దమనిషితరహాగా ప్రవర్తించ లేరా?"

ఏమనుకున్నాడోగాని వెంకటేశ్వరరావు "ఆల్ రైట్" అని వెళ్ళిపోయాడు.

"బి ఎల్ ప్యాసయ్యాడు లేపోయాకా ప్రాక్టీస్ పెట్టబోతున్నాడు ఏంబుద్ధులివి?" అన్నాడు విశ్వం జాలిగా.

వెన్నెలను కెంపురంగుతో చిత్రిస్తున్నాడు విశ్వం. రేఖలు సరిచూసుకోటానికి కొంచెం దగ్గరగా వచ్చి నిలబడివున్నాడు. ఆమె వెంటనే అలాగే చేసింది

వెన్నెలరేఖలు చూపిస్తోయి ఎరుపుదనం చూస్తూ వుండున్నాడు విశ్వం సరిగా అదే ఎరుపు ఎలా చేయటం? అది సాధ్యమయేలా లేదు మెరుపు మెరిసింది కన్ను మిరుమిట్లు గొల్పాయి. ఆ మెరుపులో మెరిసిపోయే వసంతసౌందర్యమంతా, ఆ తనూకాంతి ఉన్నదున్నట్లుగా ఎలా చిత్రంలోకి తీసుకురావటం?

వర్ణాలకందని సౌందర్యం అది. ఏయే వర్ణాలు కలిపితే ఆమె శరీరవర్ణం వస్తుందో ఆలోచిస్తూ ఆమెని నఖశిఖపర్యంతం చూస్తున్నాడు ఆ శరీరవర్ణానికి రేఖాసౌష్ఠవం మెరుగులు దిద్దుతోంది ఆ వంపులన్నీ తన చిత్రంలోకి రావాలి ఎంతవరకు తను ఆ రేఖల్ని చిత్రంలో పొందుపరచాడో!

పరిశీలనగా చూస్తున్నాడు విశ్వం ఒక్కసారి కింపోతలోకవంచేశాడు వసంత స్వరూపాన్ని వస్త్రభంగిమలో

వసంత ఇన్నాళ్ళూ ఎంత సౌందర్యం తనలో దాచి మరుగుపరిచింది! ఇన్నాళ్ళూ తను చూడని అందాలేవో ఆమెలో ఈరోజు కనిపిస్తున్నాయి

"అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైరనావిద్ధం రత్నం "

ఎవరి అనుభవంకోసం ఈ అందం?

సౌమ్యసంగీత ఝరిపోతూవు విశ్వం వసంత అలాగే మంచుమనిషిలా కిటికీలోంచి విసురుగా జల్లు కొట్టింది ఆ తుంపరలు చల్లగా విశ్వాన్ని పలకరించి పులకింపచేశాయి

బయట ఉరుము ఉరిమి మెరుపు మెరిసింది. మెరుపులో వసంత

ఆ సౌందర్యం భరించలేకపోతూవు విశ్వం తటాలున ఆమెని కౌగిలిలోకి పొదివి పట్టుకున్నాడు. కళ్లల్లోకి చూసి పెదవులు చుంబించబోతూడు. కాని అకస్మాత్తుగా ఆగిపోయాడు వసంత విదిలించుకోలేదు కాని ఆ మెముఖంలో ముఖంపెట్టి చూసిన విశ్వానికి ఆమె వదనంలో ఏదో చింతవనం కనిపించింది అది అశక్తత్వమా, భయమా, కోపమా, విస్మయో యాతనాభావమా, పేరకో మరేమిటో, లేక అన్నిటి సమ్మేళనమా విశ్వానికి అంతుపట్టలేదు. తటాలున తన్ను తాను తెలుసుకొని ఆమెని వొదిలేశాడు. తిరవాత ఒక్కమాటకూడా అతను మాట్లాడలేదు ఆమె వైపు చూడటానికికూడా సాహసించలేదు గబగబ బయటికొచ్చి ఆ గాలివానలోనే ఇంటివైపు నడిచిపోయాడు వసంత ఏమీ ఆలోచించేస్థితిలో లేదు అలాగే అతనివైపు చూసింది మెరుపు మెరిసింది. కిటికీలోంచి వరదర నడిచిపోతూ విశ్వం కనిపించాడు అప్పటికి ఆమెకి పరిస్థితి తెలిసింది ఆమెకి తెలియకుండానే కిటికీదగ్గరగా వచ్చింది ముఖంమీద జల్లు కొడుతోంది. తనుమాత్రం అతని వెనక్కి రావాలని ఆమెకి తోచలేదు అలాగే చూస్తూ నిలబడ్డది

## 13

ఆ రాత్రంతా విశ్వానికి సరిగా నిద్రపట్టలేదు. కన్ను మూసుకున్నా కన్ను తెరిచినా వసంత కనిపించింది తెల్లటి అందాలతో, నల్లటి కొంగులలో మెరిసిపోయే వసంత! తిగ్గనిత్యాటి కబుర్లుచెప్పే వసంత! అమాయకంగా మనసులో ఉన్నదన్నీ చెప్పే వసంత! మేకపిల్లలాంటి వసంత! హఠాత్తుగా విశ్వం ఉలిక్కిపడ్డాడు అప్పుడే మాగన్నుపట్టింది కల వచ్చింది మేకపిల్లని తోడేలు తరుముతోంది పట్టుకుని పంజాకు చేరికి కల చెదిరిపోయింది అంతచలిలో ఆ పోరుగాలిలో కూడా విశ్వానికి ముచ్చెమటలు పోశాయి. తనే తోడేలు! ఎవరో ఆ మాటతో నిందించాడు. కాని పరాభముఖాని మనుంభంలా తిరగాదు తను వసంత ఏమనుకుందో ఆ ముఖ కవళికలు తిరిగా మర్చిపోలేను ఆ వదనంలో చెదిరిపోయిన గుండె కనిపిస్తోంది తనకి తొలగిపోయిన విశ్వాసం కనిపిస్తోంది "చూస్తూ ఇంతేనా?" అని విస్మయంగా కూలబడిపోయినట్టు కనిపిస్తోంది వసంత తను అది భరించలేడు ఒక్క క్షణం — మరొక్క క్షణం తన మూర్ఖత్వం తనని విడిచిపెట్టి ఉండకపోతే ఆమెని నాశనం చేసేవాడు అక్కడికి తను అదృష్టవంతుడే

అంపెదంపెలులేని వసంత తనని నమ్మి చనువిచ్చే అవస్థ తను దురుపయోగం చేసుకున్నాడు కంచే చేను మేస్తే!

విశ్వానికి తనమీద అసహ్యం వేసింది ఒక్క మంచిపనికూడా చెయ్యలేకపోగా ప్రప్రథమంగా ఒక చెడుపని చేశాడు! ఆ ఉపన్యాసకుడు ఇప్పుడు తనని చూడి "ఇంతవరకెండ్ల తనింతకాలంలో నువ్వు

చేసిన ఒక్క తప్పని చెప్తుంటే తను ఆలోచించు కోనక్కర్లేదు మంచిదని చెప్తుంటే—అదేభూర్యత సమాధానమే చేసిన చోటే గొంగళి

ఒక్క మంచిపని!

విశ్వానికి తటాలున ఆలోచనకల్గింది. వసంతని తను పెళ్ళిచేసుకుంటే! ఒక అబలని, దురాచారానికి బలికాకుండా తప్పించుకోవాలని తాపత్రయపడే ఒక కన్యని ఉద్ధరించినట్లవుతుంది అంతకంటే ఎవరు మాత్రం చెయ్యగల గొప్ప మంచిపనేముంటుంది? తను వసంతని వివాహం చేసుకుంటాడు

కాని అది అంతసులభమా? ఎన్ని అడ్డంకులు దాటాలో! ఎన్ని చిక్కులొస్తాయో! అన్నిట్ని మానసిక్యం దౌర్భాగ్యాన్ని ప్రక్కనబడితే! ఒకవేళ వాళ్ళకి తనకే చేసుకోవాలని ఉంటే! ఈ పరిస్థితుల్లో తనేం చెయ్యాలి ఏం చెయ్యగలడు? పైగా ఈ వివాహానికి ఇంట్లో ఒప్పుకోరు కేకపోతే ఇంట్లోంచి వెళ్ళిపోయి పెళ్ళి చేసుకోవాలి. బహుశా మళ్ళీ ఇంట్లో అడుగు పెటనివ్వరు ఉద్యోగం అయితే పరవాలేదు. కాకపోతే తనెలా ఆమెని పెళ్ళిచేసుకోగలడు!

కాని వసంత అలా సంఘర్షణలో నలిగిపోతుంటే ఎలా ఊరుకోగలడు? తనామెని ఉపేక్షించలేకంత విన్నపోయిందా? నటేశ్వరరావులాంటి తోడేళ్ళ బారినుంచి ఆమె తన్నుతానెలా రక్షించుకుంటుంది, పాపం

విశ్వానికి ఎటూ తేలలేదు. రాత్రంతా ఆలోచనలతోనే కాలం గడిచింది తెల్లారేసరికి కళ్ళు ఎర్రబడి ఉన్నాయి తల దిమ్మెక్కింది వర్షంలో తడవటంవల ఆరోగ్యంకూడా దెబ్బతింది ఒంటరిగా ఉన్నప్పుడల్లా రాత్రిజరిగిన సంఘటనే మనసులో మెదుల్తోంది

విశ్వం ఇలా ఆలోచిస్తుండగా రంగనాథంగారు ఓ ఉత్తరం తెచ్చి అతనికిస్తూ "ఏమిట్రా ఇది?" అన్నారు. ఉత్తరం మొదటి పంక్తి చూడగానే అతనికి పై ప్రాణం పైనేపోయింది. అది ఆకాశరామన్న ఉత్తరం లోకల్ డెలివరీలో వచ్చింది విశ్వానికి వసంత అనే నాటకాల్లో వేషాలువేసే అమ్మాయితో సంబంధం ఉందనీ, వాళ్ళు పెళ్ళి చేసుకోబోతున్నారనీ హెచ్చరించాడు, ఆకాశరామన్న. ఇది నటేశ్వరరావు పనే అయి ఉంటుందని వెంటనే ఊహించాడు విశ్వం

"శుద్ధ అబద్ధం" అన్నాడు విశ్వం ధైర్యంగా.

"నువ్వు రోజూ పొద్దున్నే ఎక్కడికి పోతేది?"

విశ్వానికి నిజంచెప్పాలో అబద్ధం చెప్పాలో తెలియలేదు ఎందుకైనా మంచిదని నిజమే చెప్పాడు.

"ఆ అమ్మాయి ఇంటికే"

"బొమ్మ వేస్తున్నాను దానికి మోడల్ కావాలి. ఇంటిదగ్గిర బావుండదని అక్కడికి వెళుతున్నాను."

ఈ సమాధానానికి రంగనాథం కొంచెం వెనక్కి తగ్గాడు

"ఇప్పటినుంచీ అది మానుకోటం మంచిది. ఏమంటావు?"

"బొమ్మ పూర్తికావొద్దూ?"

"అక్కర్లేదు"

"అయితే సరే"

"ఒకవేళ నువ్వేమైనా మనసులో ఆ పిల్లని పెళ్ళిచేసుకుందామని అనుకుంటున్నావేమో అలాంటిది నాకు సరిపడదు నీదారి నువ్వు చూసుకోవాలి వింటే ఆ పక్షంలో ఆఖర్న ప్యాసంయనవాడివి నీ కింతకంటే ఏం చెప్పక్కర్లేదు"

అనేసి ఆయన వెళ్ళిపోయాడు విశ్వం దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు తను రాత్రి అనుకున్నాడో లేదో, అప్పుడే విఘ్నాలు మొదలు. ఈ కుళ్ళిపోయిన సంఘంలో ముందడుగు వెయ్యటం సాహసకార్యమే. కాని తను పోరాడటానికి నిలబడాలి తను చెయ్యగలిగింది తప్పక చేయాలి వసంతని తను పెళ్ళిచేసుకుని తీరాలి జీవితంలో అవకాశాలు సులభంగా రావు. వొచ్చినవాటిని సద్వినియోగం చేసుకోవాలి

ఆ సాయంత్రం వసంత ఇంటికివెళ్ళి తన నిశ్చయం చెప్పాలనుకున్నాడు విశ్వం కాని ఆమె ముఖం చూడటానికి సాహసం చాలక మానుకున్నాడు. ఉత్తరం రాద్దామని ఆలోచించాడు. కాని ఉత్తరాలు ప్రమాదకరమని రాయలేదు

ఈ సంఘటన జరిగిన తరవాత విశ్వానికి ఇంట్లో మెసలటం కష్టం అనిపించింది తనని అదోలాంగా చూస్తున్నారు అదికాక తను లెక్కలు వచ్చి ఉద్యోగంలో ఇంకా చేరలేదు తనమీద నిర్లక్ష్యభావం ఇంట్లోవాళ్ళకి ఏర్పడసాగిందని అతను భావించాడు.

# అంతర్వాహిని

అదృష్టవశాత్తూ తను విజయవాడలో ఒక ఆఫీసులో ఉద్యోగానికి పెట్టిన దరఖాస్తుకి ఫలితం దక్కేలా ఉంది. ఇంటర్వ్యూకి రమ్మని రాగానే విశ్వం ఏమీ ఆలోచించకుండా వెంటనే బయలుదేరాడు, పెట్టేబేడా సర్దుకుని. ఉద్యోగం చిన్నదే, అయినా తాత్కాలికంగా చెయ్యవచ్చు అనుకున్నాడు. రంగనాథంగారేమీ అడ్డు చెప్పలేదు. ఈ ఊరినించి వెడితే అమ్మాయి వ్యవహారం కూడా పరిష్కారమైపోతుందని ఆయన భావించాడు. అందువల్ల ఏదో ఓ ఉద్యోగం ఎక్కడ దొరికినా సరే వెళ్లటం మంచిదని ఒక సాధారణ సలహా ఇచ్చాడాయన. విశ్వానికి ఆ సలహా కొంచెం కష్టంగానే ఉంది. తను ఇంట్లో ఊరికే ఉండటంవల్ల అలా తండ్రి అభిప్రాయపడ్డాడని అతను అనుకున్నాడు.

విశ్వం దరఖాస్తుపెట్టింది ఒక రాజకీయపార్టీ ఆఫీసులో అకౌంటెంట్ పనికి. ఇంటర్వ్యూలో కార్యదర్శి ఏవేవో ప్రశ్నలడిగి చివరికి విశ్వంవైపు దీక్షగా చూసి అన్నాడు

“రావు అనే పేరు బ్రాహ్మలేకదండీ పెట్టుకునేది?” ఆ ప్రశ్నలోని భావం వెంటనే విశ్వానికి అర్థంకాలేదు

“ఈ రోజుల్లో అందరికీ అది మామూలుగా ఉంటోంది గదండి” అన్నాడు

కార్యదర్శి విశ్వంవైపు చూస్తూ ఏదో అనటానికి సంకోచిస్తున్నాడు

“మీరు ?” అంతవరకే ఆయన అడిగాడు, విశ్వం సమాధానంకోసం ఎదురుచూస్తూ

అర్థమైంది విశ్వానికి. అతనిముఖంలో అసహ్యం తాండవించింది. ఈ మనిషికి రెండుముఖాలు. గట్టిగా అడిగే ధైర్యం ఆయనకి లేదు. కులతత్వాలకి అతీతుడననుకోవాలి ప్రజలు. అడక్కుండా ఉండలేడు. తన కులంవాడు కాకపోతే ఉద్యోగం ఇవ్వడు. అంతవరకు ఖాయం. “మంచిచెడ్డలు రెండే కులాలు అన్నాడు కదూ కవి! మరి నామంచినిగురించి నేను చెప్పుకోకూడదు” అన్నాడు నవ్వుతూ. కార్యదర్శి ముఖం చిట్లించుకున్నాడు. అలా చిట్లించుకుంటాడని విశ్వానికి తెలుసు. ఆయనకి నచ్చే సమాధానం తనదగ్గరుంటే మాటిగా చెప్పేవాడేనని కార్యదర్శి ఊహ! అలాంటి ఆఫీసులో ఉద్యోగంఇచ్చినా తన కక్కర్లేదు. అయినా తన పైకి కనపడనివ్వకుండా ఏవో ఒకటిరెండు విషయాలు మాట్లాడి ఇంటర్వ్యూ ముగిస్తూ “వెళ్లిరండి” అన్నాడు కార్యదర్శి

“ఫలితం ఎప్పుడు తెలియచేస్తారు?”

“పోస్టులో తరవాత పంపిస్తాం- సెలెక్టయితే”

వెళ్లాడు విశ్వం. ఆ తరవాత పదిహేనురోజులకొద్దీ ఆఫీసులో విచారిస్తే ఆ ఖాళీ భర్తీ అయిందని తెలిసింది. కొత్త ఉద్యోగి కార్యదర్శిగారి స్వకులస్థుడేట! బి.ఏ తప్పాడట!

విశ్వం ఓగది అద్దెకు తీసుకుని ప్రతిఆఫీసు తిరగసాగాడు. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజిలో పేరు నమోదు చేయించుకున్నాడు. కనీసం లోయర్ డివిజన్ గుమాస్తా అయినాసరేనని ఆఫీసర్ గారితో చెప్పాడు. ఒక ఆఫీసులో ఉద్యోగం వచ్చినట్టే వచ్చి పోయింది. పొద్దునవచ్చి పనిలో చేరమని అధికారంగా చెప్పాడు మేనేజర్. ఇంటికి ఉత్తరంకూడా రాసేశాడు ఉద్యోగం వచ్చిందని. కాని ఉదయం ఆఫీసుకి వెళ్లేసరికి మేనేజర్ తన విచారం తెలియచేశాడు. కొన్ని పరిస్థితులవల్ల ఆ ఉద్యోగం మరొకరికి అకస్మాత్తుగా ఇవ్వవలసొచ్చిందని చెప్పాడు. కాళ్ళీడ్చుకుంటూ నిరాశతో వెళ్ళిపోయాడు విశ్వం.

ఇంటినుంచి తెచ్చిన డబ్బు అయిపోవచ్చింది. ఉద్యోగంవచ్చే ఆశ ఏమీ లేదు. తిరిగి ఇంటికి వెళ్ళటానికి అతని అభిమానం అడ్డొచ్చింది. ఏ ఉద్యోగమైనా సరే చేరటం మంచిదట! పూట గడిచేది ఏదైనా సరే తను చేరదలుచుకున్నాడు. కాని ఆశలన్నీ అడియాసలౌతున్నాయి. కాఫీ మానేశాడు. టిఫిన్ మానేశాడు. భోజనంలో పెరుగు మానేశాడు. తరవాత ఒకపూట భోజనం మానేశాడు. ఏదో ఒక టిఫిన్ భోజనం బదులు తినటం చేసేవాడు. తరవాత రెండుపూటలు అలాగే చేశాడు.

అర్ధాకలివల్లా, నిరాశవల్లా పట్టుదల సడలజొచ్చింది. కాని అభిమానం అడ్డుకొస్తోంది. ఏ ఉద్యోగమైనా సరే! ఆనర్స్ పాసైనట్టు ప్రొవిజనల్ సర్టిఫికెట్టు చేతిలో ఉంది. కనీసం తిండిపెట్టే స్తోమతు దానికి లేదా?

డబ్బు తగ్గిపోతున్నకొద్దీ దాని విలువ మరింత ఎక్కువైపోతోంది. ఒకపూటే టిఫిన్ తీసుకోసాగాడు.

భోజనం మొదలే లేదు. చివరికి ఆలోచించి అతి చౌక విధానం కనిపెట్టేశాడు బతకటానికి అరటి పళ్లు!

"ఫరవాలేదు. అరటిపళ్లు బాగానే ఉంటాయి" అనిపించింది విశ్వానికి. చాలారోజుల తరవాత మొదటి సారిగా రుచిచూశాడు. తనకి అవి సహించేవికావు పూర్వం చక్కెర కేళీ అయితేనే తినేవాడు

ఉన్నడబ్బయిపోయింతరవాత ఏం చేయాలో విశ్వానికి తోచలేదు. తక్కువ పనులు చెయ్యటానికి అతని మనస్కరించటంలేదు. రిక్షా లాగి కూలీ చేసు కొని బతకొచ్చునే ఏం? కాని— 'శ్రీగన్ ధర్మాణి పశ్యతి!' జీవించటానికేనా పనిచెయ్యాలి. అందులో గౌరవహాని ఏంలేదు. కాని తనదగ్గరవు వృథా! అయినా పనిచెయ్యటానికి తను సిద్ధమే. కాని పని ఎవరిస్తారు? ఒకసారి బట్టలషాపులో తను కనుగొనుక్కున్న గ్లాకి కళ్లలో మెదిలాడు. అతని రూపానికి తన రూపానికి ఇప్పుడెంత తేడా ఏంలేదు. గడ్డంచేసి ఎన్నాళ్ళో అయింది. తేడా పెట్టి తీసుకోవటమే! ఎనిమిది అరటిపళ్ళొచ్చాయి.

తనమాత్రం దబ్బిరా విశ్వమే తను. అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అనుకున్నట్టే వాళ్లని పాడు భూతితో చూశాడు. అభిమానం చంపుకుంటున్నాగా, పాపం.

తను ఎన్నో పనులు చెయ్యదలచుకున్నాడు కాని తనజీవితం ఇలాగే అంతమవుతుందేమో! ఇప్పుడు ఈ స్థితిలో వసంత తనని చూస్తే! ఏం చేస్తుందో! కన్నీటితో అభిషేకం చేసుందేమో!

తనని చూసి తను జాలిపడుతున్నాడు. ఆక స్మాత్తుగా ఈవిషయం గ్రహించాడు విశ్వం. ఇతరుల బాధలు చూసి జాలిపడటం మంచిగుణం. కాని తన మీద జాలి ఘోరం! మరుక్షణంలో విశ్వం ముఖంలో గాంభీర్యం వచ్చింది.

పండుకాంతులు విరజిమ్ముతోంది సూర్యబింబం. మర్నాడు తను ఏదో ఒకపనిలో చేరతాడు. అది ఏదైనా సరే. దృఢనిశ్చయం అతని కళ్లలో మెరి సింది. ఏంచేసినా ఇక తనమీద తను జాలిపడడు. అనంత విశ్వంలో తనూ ఒకడు. తన బతుకుకోసం ఏదోవిధంగా ప్రయత్నించటం తన విధి. ఇన్నాళ్లూ తెలీలో తెలియని గౌరవం తనకి ఆపాదించుకొన్నాడు. తను చదువుకున్నవాడు కావొచ్చు. అయితే చదువు పనికొచ్చే పరిస్థితి లేనప్పుడు తను విచారించాల్సిన అవసరమేమీ లేదు. తను కొంతవిజ్ఞానం సంపాదించు కున్నాడు. అది విజ్ఞానంకోసం. అంతే. అది ధనా ర్జనకి పనికిరాలేదని తనకి ఇంత కాలంగా తెలియలేదు వెర్రివాడు తను! పరిస్థితులు తనకెన్ని గుణపాఠాలు చెప్తున్నా కూడా బుద్ధివాడై గమనించలేక కాలం వృథాచేశాడు!

విశ్వం అరటిపళ్లు కొంటున్నప్పుడు నడిచాడు. నాలుగు అరటిపళ్లుకొని తినటమారంభించాడు. పరాయి కనిపిస్తే మంగలిల్లు తాగాడు. రెండడు గులు వెయ్యగానే ఆకస్మాత్తుగా నీరసం ఆవహించింది. ఎన్నాళ్లనించో అరటిపళ్లమీద బతుకుతున్నాడు. అది కడుపునిండా తను తినలేదు. తిన్నా సరిపడదు. కాసేపు కూర్చొని మళ్ళీ రెండడుగులు వేశాడు. కళ్లు గిర్రున తిరిగాయి. ఎదురుగుండా రిక్షా వస్తోంది. పక్కకి తప్పుకుంటూ తూలిపడిపోయాడు. రిక్షాలో కూర్చొనివున్న స్త్రీ ఆదృశ్యం చూసింది. రిక్షా ఆగింది. రిక్షావాలా విశ్వం ముఖం మీద నీరు జల్లాడు. విశ్వం తెప్పరిల్లి కళ్లు తెరిచాడు. "ఎవరో ముసలాడు కాబోలు పాపం. ఎన్నాళ్ళనించి తిండి లేదో. ఇదిగో ఈ రూపాయి అతని చేతిలో పెట్టు" రూపాయి నోటు రిక్షావాలాకి అందించిందామె. అతనది విశ్వానికివ్వబోయాడు.

"నేను అనుకున్నట్టి వాడినికాదు?" వినయంగా హీనస్వరంతో అన్నాడు విశ్వం.

"మీ రెవరు? ఇలా పడిపోయారేం?" అం దామె అనునయంగా, తను చేసిన పొరపాటుకి చింతిస్తూ.

"నేను ఆనర్స్ గ్రాడ్యుయేటుని, కవిని చిత్ర కారుణ్ని" అంటూ ఆమె ముఖంలోకి చూశాడు విశ్వం. అతని ముఖం వివర్ణమైంది. ఆశ్చర్యంతో "వసంతా!" అన్నాడు. ఆ పిలుపుకి వసంత అప్రతిభురా లైంది. పరికాయించి చూసింది విశ్వాన్ని. సంభ్రమా శ్చర్యాలతో దగిరికొచ్చింది.

"మీరేనా బావా! ఏమిటిదంతా?" ఆమె కంఠం గద్గదికమైంది.

విశ్వం ఏమీ అనలేదు. నెమ్మదిగా లేచి నుంచు న్నాడు. కింద అరటిపళ్ళు పడివున్నాయి. వొంగి తీసుకోవాలని ప్రయత్నించి కిసకిస నవ్వాడు.

"మాట్లాడవేం బావా?" అంది వసంత అతనివైపు జాలిగా చూస్తూ.

వాళ్లో కల్పించుకోను. కాని అతని పరిస్థితులు మరీ విషమించేటట్టున్నాయి, ఏదో శౌర్యాలని వదుం కట్టాడు. చూస్తూ ఎలా ఊరుకోను? ఒంటరిగా ఏం చేస్తాడు! ఇద్దరం కలిసి ఒక అభ్యర్థిని పోటీనించి విరమింపచేయాలని ప్రయత్నించాం. ఇద్దరికీ మా మీద అనుమానం ఏర్పడ్డది. మే మేదో మూడో పార్టీ పెటి ఊరు మావైపు తిప్పుకోవాలని చూస్తున్నామని వాళ్లూహించారు."

"మన విదేశాంగ విధానంలా ఉంది నీ కథ"

"చివరకు మారిందిలే. విను. మరి మూడో పోటీదారు వచ్చాడనుకునే సరికి వాళ్లిద్దరూ ఏకమయ్యారు. ఇద్దరూ కలిసి ఏదో సంప్రదించుకున్నారు. పోటీ తప్పిపోయింది. కక్షలు తగిపోయాయి. అంటే నా ప్రయత్నం సఫలమైందన్నమాట. నాకేం సన్మానం జరుగుతుందని తెలుసులే'

"శుభం. కాని దెబ్బల సంగతేమిటయ్యా మహా ప్రభూ?"

"అదే సన్మానం కావాలని రెచ్చగొట్టానులే. అయితే ఇంత పని జరుగుతుందని అనుకోలేదు. ఏదో కొద్దిలో పోనిస్తారనుకున్నాను."

"నువ్వు చెప్పేది నాకేమీ అర్థం కావటం లేదు."

"అర్థం కావటానికేముంది? పోని ఇంకొంచెం వివరంగా చెబుతాను. వాళ్ళు పోటీ విరమించుకోమని మంచిగా చెబితే వినలేదు. వినరని ముందే తెలుసులే. అందుకని ఈ మూడోపక్షం గురించి పుకార్లు లేవదీశాను. అక్కడా ఆక్కడా వాళ్లని గురించి నేనేదో అన్నట్టు కల్పించాను. దాంతో వాళ్లకి ఉద్రేకాలు పెరిగాయి. ఏమయితే ఏం? ఊళ్లో పేచీలు తప్పిపోయాయి ప్రస్తుతానికి."

విశ్వం మూర్తివైపు ఆశ్చర్యంగా చూశాడు

"అయితే సాహసించి కావాలని అభాండాలు కల్పన చేసుకున్నావా?"

"మరి ఏం చెయ్యను? లేకపోతే ఆ ఊళ్లో బతకటం మరీ కష్టం. నీకు తెలుసుగా. గలాటాలంటే నాకు చెడ్డ తలనొప్పి."

"నిన్ను కొట్టినవాళ్ళెవరు?"

"ఎవరయితే ఏంలే"

"అదేమిటి! క్రిమినల్ కేసు పెట్టి జైల్లో వేయించి వాడి పాట్లు వాడికి కరపకుండా ఉంటారా?"

"నీకు తెలియదులే బావా. ఈ గొడవంతా, ఆ కొట్లు గొడవలు లేకుండా చెయ్యటానికే కదూ ఇంత శ్రమ పడ్డది."

విశ్వం మూర్తివైపు అర్థం కానట్టుగా చూశాడు

"అయితే వాడిని వొదిలేసావా?"

"లేకపోతే వాడిమీద నాకు కక్షేమిటి? వాడు ఎదురుగా వస్తే ఎడంచేత్తో కాలర కట్టమీదికి విసిరెయ్యగలను. బుద్ధి తక్కువపని చేశానని ఏదో ఏదో మంటూ ఉంటాడీపాటికి."

"నీది గాంధీగారి పద్ధతిలా ఉంది"

"నాదేం దరికాదు. అది నా స్వభావం అంతే,"

"సుజనపద్ధతి అంటారే."

"అదిగో, అదే నాకు సరిపడదు. నేను వాళ్లకో సహా, వీళ్లకో సహా ఏదీ చెయ్యలేదంటే నమ్మరేం? నాకో ఊరుంది. ఆ ఊళ్ళో నేను జీవితం గడపాలంటే అందుకు తగిన వాతావరణం సాధ్యమైనంత వరకూ కల్పించుకోవాలి. దీనికేమిటో పేర్లు పెడతారేం! ఇంతా చేస్తే, ఈ మూడోపక్షం సంగతి ఆ ముసలిగారబ్బాయి టపాకాయలా పేల్చేస్తాడేమోనని భయంగా ఉంది. ఎరక్కపోయి అతనికి చెప్పాను. ఊళ్లో అప్పుడే నేనేదో తంత్రం పన్నానని గుసగుసలుగా ఉందిట. నాన్న చెప్పాడు. అసలు ఈ మనుషులకి పొగడ్తలంటే మహా ఇష్టం."

గబగబ మాటాడటంతో మూర్తికి కొంచెం ఆయాసం వొచ్చింది. జానకి అతనిని మాట్లాడవద్దని హెచ్చరించింది.

విశ్వం మూర్తివైపు ప్రశంసాపాత్రంగా చూడసాగాడు. ఏదో పొగడ్తగా అనబోయినవాడల్లా మూర్తి అన్న చివరిమాటలు విని నోరెత్తకుండా ఊరుకున్నాడు. మూర్తిని తను చిన్నప్పటినించీ ఎరుగు. వాడింత ఘటికుడని తను అనుకోలేదు, తను వాడినించి నేర్చుకోవాలిసింది చాలా ఉంది!

మరి కాసేపటికి వెంకట్రామయ్యగారు వచ్చి "మీరిద్దరూ వెళ్ళి భోజనం చేసిరండి. నేను మీరొచ్చేదాకా మూర్తి దగ్గర ఉంటాను" అన్నారు.

జానకి, విశ్వం అన్నట్టే బయటికొచ్చారు దారిలో జానకి మారినిగూర్చి వెంకటపతి వృత్తాంతంతోసహా అంతా చెప్పింది విశ్వానికి అదంతా చాలా కొత్తగా ఉంది మారి ప్రవర్తనవిజంగా ఆశ్చర్యం అనిపించిందతనికి తను మారిని హైదరువుకి వెళ్ళమని ప్రోత్సహించాడు, వెడితే మారి బాగుపడేవాడే వ్యక్తిగత అభ్యున్నతి దృష్ట్యా కావి ఊరు పాతకాలంలో లాగే ఉండేది

భోజనంచేసి పడక కుర్చీలో పడుకున్నాడు విశ్వం అతని మనసులో ఏవేవో ఆలోచనలు కదిలాయి. జానకి చాపమీద కూర్చుని ఏదో పనిచేసుకుంటోంది

ఆమెవైపు యథాలాపంగా చూశాడు విశ్వం ఆమె వదనంలో ప్రశాంతత తాండవిస్తోంది తనని దౌర్భాగ్యస్థితిలో చూసినప్పుడు ఆమె ముఖంలో ఎంత ఆవేదన ప్రస్ఫుటమైంది! పొంగి పొర్లే దుఃఖాన్ని ఆమె బలవంతాన అణుచుకుంటుంటే ఆ గుంఖమంతా కన్నీరై నేలమీదికి జారే దృశ్యం అతని మనోవీధిలో మెరిసింది అది విపరీత పరిస్థితే కావచ్చు; కాని తను కష్టంలో ఉంటే అంతగా ఆమె బాధపడాల్సిన అగత్యమేమిటి?

అకస్మాత్తుగా విశ్వం భావవీథిలో ఏదో వెలుగు గోచరించింది జానకి తనని ప్రేమిస్తోందా? ఎలా ఈ విషయం తెలుసుకోవటం ఒక వేళ ఆమె తనని ప్రేమిస్తే జీవితంలో ఒక గొప్పసమస్య తను ఎదుర్కోవాలి. పరిస్థితులు శ్రుతిమించకముందే నిజం తెలుసుకుని సమయోచితంగా ప్రవర్తించాలి సరాసరి ఈ ప్రశ్న జానకిని అడిగితే? ఆమె ఏమనుకుంటుందో! ఇప్పటికే ఒకసారి ఒక వ్యక్తి ఇచ్చిన దనువుదుర్వినియోగం చేసుకున్నాను ఢోంక తియ్యకుండా ఆమెచేత విషయం బయటపెట్టించాలి.

"జానకీ "

"ఏమిటి బావా?"

"వ్యక్తిలో ఎటువంటిగుణాలు నీ కిష్టం?"

"మంచి గుణాలు." ఇదికూడా ఓ ప్రశ్నలా అన్నట్టుగా జానకి సమాధానం చెప్పింది

"చెడుగుణాలుగల మనిషైతే?"

"బాధగా ఉంటుంది."

"అది సరే. అతనిపట్ల నీ ప్రవర్తన ఎలా ఉంటుంది?"

"ఇప్పుడెందుకా సంగతి?"

"కావాలి."

"ఆ సందర్భంలోకాని తెలియదు "

"నేను కావాలని అలవాటుచేసుకుంటావనుకో "

"వాటిని చివాట్లు పెడతాను "

"అంతేగాని ఇంకేం చెయ్యవా?"

"వీలైతే బాగుచెయ్యటానికి ప్రయత్నిస్తాను "

"లేకపోతే?"

"ఒక దణ్ణంపెట్టి ఊరుకుంటాను "

"అంతేగాని అసహ్యించుకోవా ?"

"గుణాల్నిగాని మనుషుల్ని అసహ్యించుకోటం ఎందుకూ ?"

"నీకాలోయే భర్త అలా చేస్తాననుకో "

"చాల్లెద్దూ, వేళాకోళం " అంది జానకి చిరుకోపంతో విసుగ్గా

"కాదు జానకీ చెప్పు "

"అప్పుడేంచేస్తానో వొచ్చి చూద్దువుగానిలే "

ఆమెవంక పరిశీలనగా చూశాడు విశ్వం.

"గావిస్తావా ?"

"పరాయివాడివైనట్టు మాట్లాడతావేం?"

"రానిచ్చినా ఇటువంటి సంగతులు చెబుతావేమిటిలే," ఆమెవంక దొంగతనంగా చూస్తూ అన్నాడతను. జానకి ఏమీ మాట్లాడలేదు

"ఊరికే అన్నాలే జానకీ, నీకు మంచి మొగుణ్ణి వెతికి పట్టుకొస్తాంగా "

"పనీపాటా లేకపోతేసరి " అంటూ జానకి లేచి వెళ్ళిపోయింది

"వెళ్లకు, వెళ్ళకు, నీకు పుణ్యముంటుంది, ఒక్క సలహా ఇవ్వు జానకీ "

"నాకు సలహాలివ్వటం రాదు "

"వొచ్చులే చూడు, మనిషి ఏదైనా ఒక మంచి పని చెయ్యాలని నీకనిపించదూ?"

"ఒక టేమిటి, చాలా చెయ్యాలి "

"కనీసం ఒక్కటి కొంచెం ఆలోచించి చెప్పు. ఏ పనిచేస్తే బావుంటుందంటావు ?"

"నీ ఇష్టంవచ్చింది చెయ్యి. నాకేం తెలుస్తుంది".

గలిగే విదేశీ సాంకేతిక విజ్ఞాన నిపుణులను కూడా మనం అత్యధిక వ్యయ ప్రయాసలకోర్చి దిగుమతి చేసుకోవాలి. ఒక అణుశక్తి ఉత్పత్తి యంత్రాంగాన్ని మన దేశంలో స్థాపించాలంటే దాని కవసరమైన ప్రతివస్తువు కూడా విదేశాలనుంచే రావాలి. ఆ వేవీ కూడా మన దేశంలో ఇంకా ఉత్పత్తి కావటం లేదు. ఉత్పత్తి సాధకాలైన యంత్రాంగాన్ని ఎల్లకాలం మనం విదేశాలనుండి దిగుమతి చేసుకోజాలం. ఈ ఉత్పత్తి సాధక యంత్రాంగాన్ని నిర్మించే ఉత్పాదక శక్తి కూడా మనదేశంలో పెంపొందించుకోవాలి. ఒక దేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చాలంటే అన్నిటికన్నా ముందు విస్తృతమైన రవాణా సౌకర్య నిర్మాణం అవసరం. అందులో భారతదేశం అతివిశాలమైనది. బొగ్గుగను లొకచోట, ఇనుము ఉక్కుగను లొకచోట, యంత్రాంగం ఒకచోట, పెట్టుబడిదారు లొకచోట, ఎగుమతి దిగుమతులకు నౌకా కేంద్రాలొకచోట ఉన్నాయి. వీటన్నింటిని అత్యాధునిక రవాణామార్గాల ద్వారా కలపడం సామాన్యమైనది కాదు. ఈ రవాణా యంత్రాంగానికి మనం సంపూర్ణంగా విదేశీ దిగుమతులపైనే ఆధారపడవలసి వస్తోంది.

ఇంకొక విషయం కూడా ఇక్కడ అవిస్మరణీయమైనది. మనం విదేశాలనుండి కొనగలిగే వస్తుజాల పరిమాణం, మనం విదేశాలకమ్మగలిగే వస్తుజాల పరిమాణంపై ఆధారపడి ఉంటుంది. మనది బీదదేశం. విదేశీ అభిరుచులకు తగినట్లుగా మనం వస్తువులను తయారు చేయలేం. ఇక మన ఎగుమతులలో ముడిపదార్థాలే ఎక్కువ. ఇటీవల ఈ ముడిపదార్థాల విక్రయంలో కూడా మన దేశం వెనుకపడుతోంది. కొన్ని వస్తువులలో ప్రపంచక్రయవిక్రయంలో భారతదేశం ఆధిపత్యం వహించింది. ఉదాహరణకు, జనపనార వస్త్రములు, టీ మున్నగునవి. కాని నేడు ఆ వస్తువులు సహితం విదేశీయుల స్పర్థకు తట్టుకోలేకపోతున్నాయి. పాకిస్థాను జనపనార వస్త్రరంగంలో చాలా ముందంజవేసింది. అదికాక మన ఎగుమతులు వ్యవసాయికమైన వగుటవలన వాని ఉత్పత్తి పరిమాణాలు మన అదుపులో ఉండవు. ఒక సంవత్సరం ఎక్కువ ఉత్పత్తి కావచ్చు. ఒక సంవత్సరం తక్కువ కావచ్చును.

1956 వ సంవత్సరంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమైనదాదిగా విదేశీమారకరంగంలో మనకన్నీ అడ్డంకులే సంభవింపసాగాయి. ఎన్నో అవాంతరాలు సంప్రాప్తిస్తాయని మనం ఊహించే ప్రణాళికా పథకాన్ని తయారుచేశాము. కాని మన ముందున్న అవాంతరాలను పరిష్కారమార్గాల నింకా యోచించుకోవలసి ఉన్నామే. అనేకవిధాలైన నూతనసమస్య లుద్భవించి మన పథకాన్ని తారుమారు చేశాయి. ఈవిధంగా తారుమారౌతుందని ముందుగానే ఊహించి ప్రణాళికా పరిమాణాన్ని తగ్గించమని హెచ్చరించినవారు లేకపోలేదు. ప్రప్రథమంగా వారిలో పేర్కొనదగినవ్యక్తి ఆచార్య బి ఆర్ షినాయ్. ఈయన 1956 లోనే, ఆర్థికశాస్త్రజ్ఞుల సమితిలో (Pannel of Economists) పూర్తిగా వ్యతిరేకించి, ప్రణాళికారచనలో వాస్తవికత లోపించరాదని ఉద్ఘాటించారు. అయితే అప్పట్లో ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సంపూర్ణ విజయం సంపాదించామనే గర్వంతో (నిజానికి మనం సంపాదించిన విజయం అతి తాత్కాలికమైనది) ఆయన మాటలు ఎవరూ వినలేదు. క్రమంగా దిగుమతుల సంఖ్య అత్యధికమైపోవడం, ఎగుమతులు క్షీణించడం, విదేశాలనుండి అనుకున్నంత సహాయం రాకపోవడం సంభవించి ఆ ఆర్థిక శాస్త్రజ్ఞుని మాటలను సత్యాంశాలుగా నిరూపించాయి. నేటికీ భారతప్రభుత్వం ప్రణాళికాసంఘంకాని, భారతదేశంలో ద్రవ్యోల్బణం అంతగాలేదని ప్రకటించడం ఎంతైనా హాస్యాస్పదంగా ఉంది. ఎన్ని జయంకన్నా వాస్తవిక పరిస్థితులపట్ల అంగీకృత్వం వహించవలసి అవుతుంది.

ఇక ప్రణాళికారచనలో అంచనాలను పరిశీలించిన పిదప అవి ఏవిధంగా తారుమారయ్యాయో పరిశీలిద్దాం.

దిగుమతులు ఈ క్రిందివిధంగా అంచనా వేయబడ్డాయి. అయిదు సంవత్సరాలకు కలిపి మొత్తం దిగుమతులపై చేయబడవలసిన వ్యయం రూ 4,340 కోట్లు అంటే సరాసరి సంవత్సరానికి ఎనిమిదివందల డెబ్భై కోట్ల రూపాయిలన్నమాట. ఈ ఖర్చులో ఎక్కువ భాగం, యంత్రాంగం, వాహనసౌకర్యాలు, ఇనుము ఉక్కులోహాలు, తైలములు మొదలయిన వానిపై వెచ్చింపబడుతుంది.

ఇక, ఎగుమతులు మొత్తం రూ 2,965 కోట్ల ఖరీదు కలవిగా అంచనా వేయబడ్డాయి. అంటే సరా

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

సరిగా సంవత్సరానికి 593 కోట్ల రూపాయల విలువగల వస్తు సముదాయాన్ని భారతదేశం 1956-61 లో ఎగుమతి చేయగలదని ఊహింపబడింది. భారతదేశపు ఎగుమతులందు ముఖ్యవస్తువులు, టీ, జనపనార వస్తువులు, ప్రత్తి వస్తువులు. 1955వ సంవత్సరపు ఎగుమతులకన్న ఎక్కువ ఎగుమతి పరిమాణం, టీ, ప్రత్తివస్త్రములందు సాధ్యమౌతుందని భావింపబడింది. ఈ అధిక పరిమాణమైనా అంత చెప్పుకోదగినది కాదు. అది మాటికి ఇరవై పాళ్లకంటే కూడా తక్కువే.

1956-61 ఎగుమతుల అంచనా

| వస్తువులు | ఎగుమతి పరిమాణం (1956-'61) |
|---|---|
| టీ | రూ 635 కోట్లు |
| జనుము, వస్తువులు | 610 ,, |
| ప్రత్తి, వస్త్రములు | 375 ,, |
| తైలములు | 110 ,, |
| పొగాకు | 75 ,, |
| తోళ్ళు, చర్మం | 140 ,, |
| ముడిప్రత్తి, వేస్టు | 110 ,, |
| లోహ ఖనిజములు | 115 ,, |
| బొగ్గు, కోక్ | 25 ,, |
| రసాయనికములు, మందులు | 25 ,, |
| ఇంజను వస్తువులు, విద్యుత్పరికరములు | 20 ,, |
| ఇతరములు | 725 ,, |
| | రూ 2,965 కోట్లు |

దిగుమతుల అంచనా (1956-61)

| వస్తువులు | దిగుమతి పరిమాణపు అంచనా (1956-'61) |
|---|---|
| యాంత్రిక సామగ్రి, రవాణా వాహనములు | రూ 1500 కోట్లు |
| ఇనుము, ఉక్కు | ,, 480 ,, |
| ఇతర లోహములు | ,, 230 ,, |
| ధాన్యములు, దినుసులు, పిండి | ,, 240 ,, |
| చక్కెర | ,, 85 ,, |
| తైలములు | ,, 410 ,, |
| రసాయనిక మైన పోషణములు | ,, 160 ,, |
| రంగు సామగ్రులు | ,, 85 ,, |
| కాగితం | ,, 55 ,, |
| లోహసామగ్రి, విద్యుత్పరికరములు | ,, 145 ,, |
| ముడి ప్రత్తి | ,, 270 ,, |
| ముడి జనుము | ,, 90 ,, |
| ఇతరములు | ,, 700 ,, |
| | రూ 4,340 కోట్లు |

ఎగుమతి, దిగుమతి వస్తువులు కాక విదేశీమారకపు రంగంలో వచ్చే అంశాలు మరికొన్ని ఉన్నాయి. ఉదాహరణకు పై దేశంనుంచి సాంకేతిక నిపుణులు మన దేశానికి వచ్చినప్పుడు వారికిచ్చే, వారి జీతములు విదేశీ ద్రవ్యంలో మనం చెల్లించాలి. అంతేకాక పై దేశాలనుండి మనం పుచ్చుకున్న ఋణాలపైన వడ్డీ కట్టాలి. ఈ లెక్కలలో భారతదేశానికి మిగులు వస్తుందని ప్రణాళికా రచయితలు భావించారు. అయిదు సంవత్సరాలకు కలిసి ఈరీతిగా లభించే మొత్తం 255 కోట్ల రూపాయలు కాగలదు. అంటే సరాసరిని సంవత్సరానికి 51 కోట్ల రూపాయలన్నమాట. పై అంచనాల ప్రకారం ఎగుమతుల విలువ 2,965 కోట్ల రూపాయలు, దిగుమతుల విలువ 4,340 కోట్ల రూపాయలు. మనకు అయిదు సంవత్సరాలలోను లభించే విదేశీమారకపు ద్రవ్యం రూ 2,965 కోట్లు + రూ 255 కోట్లు = రూ 3220 కోట్లు. మనం విదేశాల కియ్యవలసిన విదేశీమారకపు ద్రవ్యం రూ 4,340 కోట్లు. అంటే భర్తీ కావలసింది రూ 1,120 కోట్ల రూపాయల విలువగల విదేశీమారకపు ద్రవ్యం. ఇంత పెద్ద మొత్తం భర్తీచేయడానికి ఈ క్రింది సూచనలను ప్రణాళికా సంఘం సూచించింది. వాని ప్రకారం భారతదేశానికి లంతమలోకల సంఘ దాపరికంనుండి రూ 200 కోట్లు, ఇతర విధములుగా భారతదేశంలో పెట్టుబడి పెట్టేవారి మూలకంగా రూ 100 కోట్లు రాగలవని భావింపబడింది. ఇక మిగిలిన రూ 800 కోట్లు విదేశీ సహాయం మూలంగా లభించాలి. అమెరికా సంయుక్త రాష్ట్రములు ప్రథమ ప్రణాళికలో గోధుమ ఋణం మూలకంగా రూ 90,31 లక్షలు, ఆంగ్లో, అమెరికా సహకార కార్యక్రమం మూలకంగా రూ 102,55 లక్షలు, ఇచ్చింది. ఆ విధంగానే ఆస్ట్రేలియా, కెనడా, న్యూజిలాండు, నార్వే, బ్రిటన్, రష్యా, ఫోర్డుసంస్థ, ప్రపంచ బాంకు మున్నగునవి సహాయం చేశాయి. ఈ సహాయం కొంత ఋణరూపకంగాను, కొంత దాన

రూపకంగాను జరిగింది. ఈ పై దేశాలు, విదేశీసంస్థలు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో కూడా ఇతోధికంగా సహాయం చూపి ఆ రూ 800 కోట్ల మారకపు ద్రవ్యాన్ని భరీ చేస్తాయని ప్రణాళికా రచయితలు ఆశించారు.

కాబట్టి ద్వితీయ పంచవర్ష ప్రణాళికా విజయం విదేశీ సహాయ్యంపై ఆధారపడి ఉంది. మొత్తం వ్యయం పరిమాణం రూ 4,800 కోట్లుగాను, స్వయంకృషివలన 4 000 కోట్లను, రూ 800 కోట్లను విదేశీ సహాయం వలన సాధించగలిగితే భారతదేశం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో సంపూర్ణవిజయం సాధించినట్లవుతుంది. అయితే రూ 800 కోట విదేశీమారక ద్రవ్యాన్ని సంపాదించడం సులభసాధ్యమైన పని కాదు. ఏదో ఒక రాజకీయ పక్షంలో చేరనిది అంత పెద్ద మొత్తాన్ని భారతదేశానికి ఏ విదేశము కేవలం కానుకగా గాని, దీర్ఘకాలిక ఋణంగా గాని ఇవ్వరు. కాబట్టి ప్రణాళిక అంచనాలు సరిగా అమలౌనట్లు ఫలించినా కూడా రూ 800 కోట్ల విదేశీ సహాయం ఒక గడ్డుసమస్య అయుతుండేది.

అయితే అంత మాత్రంతో కూడా ఆ సమస్య మనలను వదలలేదు. అది మరింత తీవ్రతర స్వరూపం ధరించి, ప్రణాళిక అంచనాలను తారుమారు చేసి, ప్రణాళికా విజయాన్నే మట్టిపెట్టే మహాసమస్యగా తయారైంది. ఇదే నేడు భారతదేశం ఎదుర్కొంటున్న విదేశీమారకపు ద్రవ్యపు కొరతవలన ఏర్పడిన అతివిషమ పరిస్థితి. ఈ సమస్య ఏ విధంగా పరిణమిస్తుందోనని భారతీయులే కాక విదేశీయులు — శత్రువులు, మిత్రులు — కూడా ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.

ఆయితే, విదేశీద్రవ్యపు కొరత అనుకున్న అంచనాలకన్న అత్యధికమై, ఈ సమస్య భావించిన దానికన్న అత్యంత విషమ మవడానికి గల కారణాలను పరిశీలించాలి. ఏ ఒక్క కారణం ఈ అంచనాలను తారుమారుచేసి సమస్యను విషమతరం చెయ్యలేదు. అనేకములైన మారిన సమస్య అంకురించి ప్రణాళికా రచయితల ఊహాలను వమ్ముచేసి విదేశీమారకపు ద్రవ్యపు లోటును అతివిస్తృతం చేసి సమస్యను మరింత అగాధం చేస్తాయి.

దిగుమతుల దృష్ట్యా తిలకిస్తే ప్రణాళికా రచయితలు ప్రథమంలో వేసిన అంచనాలకన్న అత్యధిక పరిమాణంకల దిగుమతులను మనం చేసికొనవలసివచ్చింది. ఎక్కువ దిగుమతులు చేసుకున్నామంటే ఎక్కువ విదేశీ మారకపు ద్రవ్యపులోటు ఏర్పడిన దన్నమాట. అంచనా పరిమాణాల కన్న ఎక్కువ దిగుమతులు చేసికోవలసిన అవసరం ఈ క్రింది కారణాలవలన సంభవించినది.

ప్రప్రథమంగా గణింపదగ్గది, అత్యధికమైన ఆహారపు కొరత. దేశంలో ఆహార స్వయంసమృద్ధి విషయంలో ప్రథమ పంచవర్షప్రణాళిక సాధించిన విజయం చాలా తాత్కాలికమైనది. ఆ విజయమైనా ప్రణాళికా కృషి ఫలితమనడంకంటె 1953—54 సంవత్సరాలలో భారతదేశం అనుభవించిన అనుకూలమైన ఋతు పవనముల ఫలితమనడం ఎక్కువ సామంజసమైన విషయం. కాని క్రమంగా అట్టి అనుకూలపవనాలు మారిపోయి ప్రతికూలంగా మారడంతో ఆహారోత్పత్తి పరిమాణం తగ్గిపోయింది. 1956–57 లో కూడా ఆహారోత్పత్తి గిరాకీ ఎంతమాత్రం జరిపోలేదు. ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్ మున్నగు రాష్ట్రాలలో అనుకున్న ఆహారోత్పత్తికన్న చాలాతక్కువ వచ్చింది. 1955–56 కన్న 1956–57 లో మొత్తం ఆహారోత్పత్తి 28 8% నుండి 24 8% కు పడిపోయింది.

ఈ విధంగా ఆహారోత్పత్తి తగ్గిపోయి విదేశాల నుండి అధికవ్యయంతో దిగుమతులు చేసుకోవడానికి అనేక కారణాలున్నాయి. ఆహారోత్పత్తి విచారణ సంఘం అధ్యక్షుడు శ్రీ అశోక మెహతా (Food grain Enquiry Committee report) వివరించిన కారణం ముఖ్యంగా పరిశీలింపదగినది. ఈయన భావన ప్రకారం, ఒక విధంగా దేశంలో ఆహారపదార్థాలకు గిరాకీ ఎక్కువ కావడంవల్ల ధరలు పెరుగుతాయి. కాక రైతులు ఆ పదార్థాల సాధగా ఎక్కువ తిన్నారు, పైగా ఇదివరకటికన్న తగిస్తారు కూడా. ఈయన వాదం బహిరంగంగా కొంత అవహాస్యంగా కనబడవచ్చుగాని అది సహజాతిసహజమైనది. గిరాకీ పెరగడంవలన ధరలు పెరుగుతాయి. ధరలు పెరగడంతో, పూర్వం విక్రయిస్తున్న పరిమాణంకన్న తక్కువ పరిమాణానికే పూర్వపు ఆదాయం రైతు పొందగలుగుతాడు. అంతవరకు సరియైన ఆహారాన్ని భుజించడానికి తగిన

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

సామర్థ్యంలేని పేదవారికి ఇప్పుడు తాము పూర్వం తిన్న జొన్నలు మొదలైనవాటిని వదలి బియ్యం, గోధుమ మొదలైన ఉత్కృష్ట ధాన్యాలను ఉపయోగించు కుంటారు. దీనితో అతడు కోరలిగిన సరఫరా పరిమాణం (Amount of supply) పడిపో తుంది. క్రమంగా పారిశ్రామిక పురోగమనం చెందుతూన్న దేశాలలో జనాభా పెరిగి తద్వారా ఆహారధాన్యాలకు గిరాకీ పెరుగుతుంది దీనికనుగుణంగా ఉత్పత్తి పెరగకపోయినట్లయితే ఆహారపుకొరత ఏర్పడుతుంది

ఇక రెండవకారణం మనదేశంలో కొన్ని రాష్ట్రాలలో కలిగిన ప్రకృతి భీభత్సాలు బీహార్, బెంగాల్ అస్సామ్ ఉత్తర్‌ప్రదేశ్ మున్నగు రాష్ట్రాలలో వరదలు, అతివృష్టి, అనావృష్టి దోషాలవలన అనేక లక్షల ఎకరాలు నిష్ఫలములయ్యాయి. ఈ రెండు కారణాలు కాకుండా మిడతలవల్లను, తదితర క్రిమికీటకాదులవల్ల పూర్వంకన్న ఎక్కువ నష్టం సంప్రాప్తించి, ఆహారోత్పత్తి తగ్గించింది ప్రణాళికా రచయితలు ఆహారోత్పత్తి వృద్ధికి అంచనాలు వేశారుకాని తత్కారణం నీటిపారుదల, కొత్త భూములను వ్యవసాయక క్షేత్రాలుగా మార్చ్చేయటం మొదలైన రంగాలలో ఆ భావనలు కార్యరూపం దాల్చలేదు పైగా దేశంలో ఆహార ధాన్యాలు నిరవధికంగా దాచిఉంచడంవలన, జనాభా అన్ని అంచనాలు దాటి పెరిగిపోవడం సంభవించడం వలన ఆహారసమస్య తీవ్రతరస్వరూపం ధరించింది ఈ విషమాహారసమస్య విదేశీమారకపు ద్రవ్య రంగంలో చూపిన ప్రభావం అత్యంత ప్రాముఖ్యం వహించి భారతపారిశ్రామిక పురోగమనానికి, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విజయానికి గొడ్డలిపెట్టైంది.

కేవలం ఆహారధాన్యాల దిగుమతులే ప్రణాళికా రచయితల అంచనాలను మించి విపరీత పరిస్థితి కలిగింప లేదు ఇతర యంత్రాంగం, పారిశ్రామికోత్పత్తి సాధ నాలు కూడ అంచనాలను బాగా మించి, దిగుమతి అయ్యాయి. ఒక పారిశ్రామిక పథకానికి ప్రణాళికా రచయితలు, ఉదాహరణకు రూ 300 కోట్ల విదేశీ మారకపు ద్రవ్యము విలువగల వస్తువులను దిగుమతి చేసికొన వలసివస్తుందని అంచనావేస్తే, తీరా ఆ పథకం కార్య రూపం ధరించేసరికి తదనుపరమైన దిగుమతుల విలువ రూ 400, 500 కోట్లు దాటేది. దీనితో అసలే గడ్డుగా ఉన్న విదేశీ మారకపుద్రవ్యసమస్య మరింత విషమంగా తయారవసాగింది ఈ తప్పుడు అంచనాలకు మూల కారణం, అంచనాదారులు భావించినదానికన్న ప్రపం చంలో ధరలు అధికం కావటమే.

పై రెండు కారణాలు కాక ఎక్కువ దిగుమతుల ద్వారా విదేశీమారకద్రవ్యపు లోటును అధికం చేసిన మరొక కారణం, ఇటీవలి కాలంలో భారతదేశం పెంచిన దేశరక్షణ వ్యయం భారత పాకిస్తాన్ దేశాల మధ్య గల సంబంధ బాంధవ్యాలు అభి లషణీయంగా రూపొందకపోవటంవలన, నిరంతరంగా పాకి స్తాన్ అమెరికానుండి ఆయుధ సామగ్రులను దిగు మతి చేసికొనడంవలన, విధిగా భారతదేశం కేవలం స్వయంరక్షణకొరకు విదేశీమారకపు ద్రవ్యాన్ని వెచ్చించి ఆయుధ సామగ్రులు దిగుమతి చేసికొనవలసి వచ్చింది ఈ వ్యయం ప్రణాళికారచనలో ఊహింప బడలేకపోవడంవలన విదేశీ మారక ద్రవ్య సమస్యను మరింత విషమం చేసింది

దిగుమతులపై వ్యయం ఎంత ఎక్కువ అయినప్ప టికీ, అదే పరిమాణంలో ఎగుమతులను మనం చేయగలిగి ఉండినట్లైతే ఈ సమస్య ఇంతటి తీవ్రస్వరూపం పొంది ఉండకపోను కాని ఈవిధంగా కూడా భారత దేశం లాభం పొందలేకపోయింది విదేశీ స్పర్ధలవల్ల (Foreign Competetion), అంతర్జాతీయ వాణిజ్య రంగంలో ముఖ్యంగా అమెరికాలో ఏర్పడిన ఆర్థిక మాంద్యంవల్ల, క్రమంగా హెచ్చుతూన్న భారతదేశపు ధరలవలన ఎగుమతులు ఎక్కువవడం మాటటుంచి తీవ్రం గా సంకోచం చెందుతున్నాయి కొద్ది సంవత్సరాల క్రితంవరకు జనపనార పారిశ్రామికోత్పత్తిలో ప్రపంచ వాణిజ్యరంగంలో భారతదేశం సంపూర్ణ ఆధిపత్యంవహిం చింది అయితే పాకిస్తాన్‌విభజనతో జనుముపండే సుక్షే త్రాలన్నీ పాకిస్తాన్‌కు, మిల్లులుగలప్రాంతాలన్నీ భారతదేశానికి లభించాయి విభజన తరువాత కొద్ది సంవత్సరాలవరకు పాకిస్తాన్‌లో యాంత్రిక సామగ్రి లేక పోవడంవలన అక్కడ పండిన జనుము భారత దేశానికి దిగుమతి అయింది కాని క్రమంగా పాకిస్తాన్‌లో కూడా మిల్లులు వెలిసి జనపనార వస్తువులలో ఈ రెండు దేశాల మధ్య స్పర్ధ అనివార్యమైంది దీనితో ఏ వస్తువు ఎగుమతిపై భారతదేశం, విదేశీ మారకపు ద్రవ్యంకొరకు ఆశలు పెట్టుకుందో దానిలో కే

అనంతరం సంభవించి ఎగుమతి వర్తకానికి గొడ్డలి పెట్టైంది. అలాగే ప్రత్తి వస్త్రములద్వారా మంచి రాబడి రాగలదని అంచనావాదాలు ఆశించారు కాని దీనిలో కూడా భారతదేశం నష్టాన్నే ఎదుర్కొనవలసి వచ్చింది. విదేశాలతో పోటీ పడటంతో తద్వారా లభించే మారకపు ద్రవ్యం తగ్గిపోయింది. పూర్వపు దేశాలేకాక జపాను నుండికూడా వస్త్రపరిశ్రమలో భారత దేశానికి స్పర్థ సంభవించింది. ఇంతేకాక ఆ కాలంలో సంభవించిన ఆర్థికమాంద్యం ఫలితంగా భారత దేశపు టీ ఎగుమతులకు నష్టం సంభవించింది.

అంచనాలకన్నా ఎగుమతులు తగ్గిపోవడానికి మరొక మూలకారణం ప్రపంచ ధరలతో పోల్చిచూస్తే భారతదేశపు ధరలు భారతదేశపు నూతన పారిశ్రామిక వైవిధ్యంవలన అధికము కావడం. దీనితో విదేశీయులు భారత దేశంలో అధికమైన ధరలకు దిగుమతి చేసుకోవడం మాని ధరలు తక్కువగానున్న ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకుంటున్నారు. దీనితో మన ఎగుమతులు పడిపోసాగాయి.

ఈ విధంగా ఎగుమతులు తగ్గిపోవడం దిగుమతులు అంచనాలను మించి అత్యధికం కావడంతో విదేశీ మారక ద్రవ్యం తీవ్రసంకోచం పొంది ఆ సమస్య విషమతరం అయింది. ఇంతేకాక అంతర్జాతీయ వాణిజ్యరంగంలో లెక్కకువచ్చే ఇతరములు—వడ్డీలు, అప్పులు, బహుమతులు, విద్యార్థి వేతనాలు, యాంత్రిక వ్యయాలు—మున్నగు వానియందు కూడా భారత దేశం అనుకున్నంత లాభాన్ని పొందలేక పోతోంది.

ఈ పైకారణాలవలన ప్రణాళికా రచనలోనే ఒక సమస్యగా భావింపబడిన విదేశీమారకద్రవ్యపు లోటు, ప్రణాళిక ఆచరణలోనికి వచ్చేసరికి తీవ్రతర స్వరూపం ధరించి అంతుచిక్కని అభేద్య సమస్యగా రూపొందింది.

అయితే ఈ సమస్యతో పూర్తిగా విరక్తిచెంది ద్వితీయ పంచవర్ష ప్రణాళికను త్యజింప నక్కరలేదు. సమస్య లంకురించినపుడే పరిష్కార మార్గాలు జనిస్తాయి. కొన్ని సమస్యలకు పరిష్కారమార్గాలు అత్యంత కష్టసాధ్యములైనవైతే కొన్ని సమస్యల పరిష్కార మార్గాలు సులభ సాధ్యములు కావచ్చు. ఈ సమస్య పరిష్కారం మన జాతి దీక్షపైన, మన ఆర్థిక శాస్త్రజ్ఞుల మేధాశక్తిపైన, మన రాజకీయ నేతల అంతర్జాతీయ విజ్ఞతపైన ఆధారపడి ఉంటుంది. కష్టనష్టాల నెదుర్కొనకుండా చరిత్రలో ఏ దేశం ఆర్థిక పురోగమనాన్ని సాధింపలేదు. ఏ దేశమైనా ముప్పై నలభై సంవత్సరాలలో కే ఆర్థికరంగంలో పాశ్చాత్యదేశాలను తలదన్న కలిగే అభ్యున్నతిని సాధింప కలిగినదంటే, అది ఆ ప్రజల మాతృదేశభక్తిపైనా ఆ దేశపు ఆర్థిక విధానాలపైనా ఆధారపడటం వల్లనే. జపాన్ పూర్వుల బాటల ద్వారా ఆర్థికాభ్యున్నతి సాధింపలేదు. ఏ జాతికైనా ఆర్థిక పురోగమనపథం దుర్గమమైనది. కాని తత్ఫలితం ఆ దేశపు దీక్షపైనే ఆధారపడి ఉంటుంది.

ఈ కఠినసమస్యకు మూడు ప్రధాన పరిష్కార మార్గాలున్నాయి. మొదటిది ఎగుమతుల పరిమాణాన్ని అధికం చేయడం, రెండవది: దిగుమతుల పరిమాణాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించడం. విదేశీ సహాయాన్ని పొందడం మూడవ పరిష్కార మార్గం. ఈ త్రిమార్గాలను కూడా భారత ప్రభుత్వం నిరవధికంగా కృషి చేస్తోంది.

ఎగుమతుల వధికం చేయడానికి ఉపాయాన్ని సూచిస్తూ కేంద్రమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి వస్తువులను విదేశీయులకు తక్కువ ధరకు, మన దేశపు గిరాకీదారులకు హెచ్చు ధరకు విక్రయించాలని చెప్పారు. తక్కువ ధరలు ప్రదర్శించటం ద్వారా విదేశీయుల గిరాకీని ఆకర్షింప వచ్చును. తక్కువ ధరల మూలంగా సంభవింప కలిగే నష్టాన్ని మన దేశస్థుల కెక్కువ ధరల కావస్తువును విక్రయించడం ద్వారా సరిపెట్టుకోవచ్చు. నిజానికి పూర్వం జపాన్ దేశం ఇండియా వాణిజ్యరంగంలో బ్రిటన్ను జయించి, ఆధిపత్యం సంపాదించడానికి ఇదే విధానాన్ని అవలంబించింది. దీన్నే ఆంగ్లంలో డంపింగ్ (dumping) అని వ్యవహరిస్తారు. ఈ విధానాన్నవలంబించడం ద్వారా ఎగుమతులను పెంచవచ్చును కాని ధరల తగ్గింపు వలన విదేశీయుల అభిరుచులని మార్చలేం. తరువాత స్పర్థ (Competetion) తీవ్రమైనదైతే విదేశీయులు కూడా ఈ విధానాన్నే అవలంబించి అనభిలషణీయమైన పరిస్థితులకు దారి తీయవచ్చును. కాబట్టి ఈ విధమైన పద్ధతిని అవలంబించే ముందు తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

ప్రభుత్వం వివిధ వస్తువుల ఎగుమతుల నధికం చేయ డానికి ఆయా వస్తువులకు ఎగుమతి సంఘాలను నియమించింది ఇటువంటి సంఘాలలో (Export promotion councils) అతి నూతనమైనది ఆట వస్తువుల ఎగుమతి వృద్ధికి కృషి చేసే సంఘం (Sports goods export promotion council) దీనిని యూనియన్ మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి జూలై 30వ తేదీన ప్రారంభించారు ఈ సంఘ సభ్యులు ఆయా వస్తువులకు విదేశాలలో గిరాకీ కల్పించడానికి కృషి చేస్తూ చాలవరకు కృతకృత్యులవుతున్నారు

ఎగుమతులను ప్రోత్సహించడానికి భారత ప్రభుత్వం అనేక వస్తువులపై కంట్రోళ్ళను తొలగించింది ద్వితీయ పంచవర్ష ప్రణాళికా విజయంకొరకు ఈ విధంగా సుమారు 200 ఎగుమతి వస్తువులపై ఆంక్షలు తొలగించబడినాయి అంతేకాక అవసరమైనచోట పన్నులను తగ్గించడం ఎగుమతి సుంకాలను తీసివేయడం, సబ్సిడీ నొసగి ప్రోత్సహించడం మున్నగు అనేక పనులను భారత ప్రభుత్వం చేస్తోంది ఇటువంటి ప్రోత్సాహం క్రొత్తగా పైకి వస్తూన్న ఎగుమతి దారులచే ముందంజ వేయించి విదేశీ స్పర్ధవల్ల వెనుకంజ వేస్తూన్న ఎగుమతి దారుకు ధైర్యం కలిగిస్తుందనడం నిస్సంశయాంశం

ఎగుమతులను అనేకవిధాలుగా ప్రోత్సహించడం వలన మారక ద్రవ్యసంపాదనేగాక ఉత్పాదనకూడా పెరగగలదు అధికమైన ఎగుమతులవల్ల ప్రణాళికా విజయం చేకూరగలుగుతుంది ఎగుమతులు ఇటీవలి కాలంలో వలెనే దిగజారిపోతే పరిస్థితి మరింత విషమిస్తుంది

ఇక రెండవ పరిష్కారమార్గం దిగుమతులను సాధ్యమైనంతవరకు తగ్గించడం దిగుమతుల పరిమాణాన్ని తగించేముందు ప్రధమంగా భారతదేశం చేసుకొంటూన్న దిగుమతులను విలాస వస్తువులు, అవసర వస్తువులుగా విభజన చేసి సామాన్య ప్రజా సౌఖ్యానికి అక్కరలేని విలాస వస్తువుల దిగుమతి నిషేధించడంకాని తగించడంకాని చేయాలి. భారత ప్రభుత్వం తనవునుగా అనేక వస్తువులపై ఆంక్షలు విధించి దిగుమతులను తగించింది కాని పై విభజన అంతగా పాటింపబడలేదనే చెప్పాలి అత్యవసర వస్తువులైన మందులు, రసాయనిక ఔషధాలు, బ్లేడ్లు, పిల్లల ఆరోగ్యాన్ని కాపాడే పాల్డబ్బా, ఓవల్టైన్, సిండిపాలు మున్నగు వాటిపై ఆంక్షలు విధించడం దేశానికంత క్షేమకరంకాదు వీటికి సరియైన దేశీయ వస్తువులు ఇంకా ఉత్పత్తి అవడంలేదు పిల్లల కవసరమైన పాలడబ్బాలను విలాస వస్తువులుగా గ్రహించి నిషేధించిన ప్రభుత్వ విధానం అంత ప్రశంసనీయమైనది కాదు కొన్ని విలాస వస్తువు ను సంపూర్ణంగా నిషేధించడంవలన దేశంలో ఏ కొద్ది మందికో తక్క మిగిలిన వారికి అంత ఇబ్బంది కలుగదు. ఉదాహరణానికి టాయిలెట్ సామాన్లు, కార్లు పెన్నులు, ఖరీదైన రేడియోలు మొదలయిన వాటిని ప్రభుత్వం సంపూర్ణంగా నిషేధించాలి విదేశీ రేడియోలను, అతిఖరీదైన విదేశీ వస్త్రాలను సంపూర్ణంగా నిషేధించడంవలన సామాన్య ప్రజ అంత వంత చెందదు

కాని దిగుమతి నిషేధవిధానాన్ని అనేకులు అనేక విధాలుగా విమర్శించారు అవన్నీ పూర్తిగా సత్యదూరాలు కావు ఆచార్య బి. ఆర్ షెనాయ్ మున్నగువారు, ఈ నిషేధంవలన వ్యక్తి స్వాతంత్ర్యం దెబ్బతింటుందని, భారతదేశం వంటి ప్రజాస్వామిక దేశంలో ప్రభుత్వం ఇట్టి పనులు చేయడం ప్రజాభిప్రాయవిరుద్ధమని వాదించారు ఈ వాదం సత్యమే అయినప్పటికి, దేశ సంక్షేమం కోసం ఇట్టి నిషేధాలను తాత్కాలికంగా విధించినా అంత అవభిలషణీయమైన పరిస్థితులేర్పడవు అయితే ఈ నిషేధం కేవలం తాత్కాలిక మయేట్లు మాత్రం తగు జాగ్రత్త వహించాలి రెండవ విమర్శ ఏమంటే విదేశీవస్తునిషేధం వలన దేశీయ వాణిజ్య రంగంలో గుత్తోత్పత్తిదారులకు ఆధిపత్యం కలిగి ప్రశస్తమైన వస్తువుల ఉత్పత్తి లేకపోవచ్చును. స్పర్థ లేకపోవడంతో చౌకబారు వస్తువులే అతి ఖరీదైన ధరలకు అంగడిలో ప్రత్యక్షమవడం మనం నేడు చూస్తున్నాం కాని ఈ దోషం కూడా, నిషేధం తాత్కాలిక మవడంవలన, తాత్కాలికమే అవుతుంది మనం విదేశీ దిగుమతులను నిషేధించడం వలన, మన ఎగుమతులను విదేశీయులు బహిష్కరించవచ్చును కాని ఈ విమర్శ సహేతుకమైనది కాదు ఈ నిషేధం కేవలం భారతదేశ ఆర్థిక పురోగమనమునకే అవటంవలన ఇతర దేశాలు మన ఎగుమతులను బహిష్కరించవు

దిగుమతి నిషేధంవలన గత ఒకటిన్నర వత్సరాల లోను, భారతదేశం చెప్పుకోదగినంత విదేశీ మారకద్ర

ద్రవ్యాన్ని మూసివేయటానికి కలిగింది. కాని విదేశీ కి ఇంకా ప్రదర్శిస్తే ఈ విధానం వలన మాయాన్ని ప్రజలకి ఇబ్బంది కలగకుండానే ప్రభుత్వం మరింత విదేశీ మారకపు ద్రవ్యాన్ని మూసివేటకలదు.

## విదేశీయ సహాయం

ఇక మాసివింది విదేశీయ సహాయం

విదేశీయ సహాయం ఒక సంపూర్ణ స్వాతంత్ర్య దేశం కోరవచ్చునా అన్న ప్రశ్న ఉదయించగా, రాజకీయ సంబంధం లేకుండా, అంతర్జాతీయ రాజకీయ రంగంలో దేశపు కీర్తిప్రతిష్ఠలకు భంగం వాటిల్లకుండా ఉంటేనే, విదేశీ సహాయం అభిలషణీయమైనదే అని చెప్పబడింది నిజానికి నేడు అభివృద్ధిచెందుతున్న అనేక దేశాలు పూర్వం ఎప్పుడో ఒకప్పుడు విదేశీ సహాయం పొందినవే! ఫ్రాన్సునుండి జర్మనీకి, ఇంగ్లండునుండి అమెరికాకు ధనం ఋణరూపంలో ప్రవహించిన కాలం ఉంది ఋణాన్ని స్వీకరించినంత మాత్రాన ఒక దేశం బానిసలదేశం అవదు

ఈ రంగంలో అగ్రరాజ్యాలకి అమిత ప్రోత్సాహం కలుగుతోంది భారతదేశానికి క్లిష్టపరిస్థితిలో సహాయము చేసిన దేశాలు—అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా, పశ్చిమజర్మనీ, సోవియట్ రష్యా, జపాన్—మున్నగునవి ఎన్నో ఉన్నాయి వీనిలో ముఖ్యమైనవి అమెరికా బ్రిటన్‌లు అమెరికా ఇంగ్లండు దేశాలు భారతదేశానికి కేవలం భ్రాతృభావంతో కాక ఒకవిధమైన భయంతో ఇస్తున్నాయి.

1958 జూలై 28 వ తేదీన బ్రిటిషు పార్లమెంటులో శ్రీ జేమ్స్ కాలింఘన్ ఈ ఉద్దేశాన్నే దక్షిణాగా విశదీకరించారు "ఆగ్నేయాసియాలో చైనా ప్రభావానికి లోనుగాని కమ్యూనిస్టు వ్యతిరేక పక్షానికి భారతదేశం ప్రాతినిధ్యం వహిస్తుంది. మనం హిందూ దేశానికి సంపూర్ణంగా ఆర్థిక సహాయ సహకారముల నొసగకపోతే, శ్రీ నెహ్రూ కాలంలో కాకపోయినా, ఆయన అనంతరమైనా, భారతదేశమంతా సామ్యవాద సిద్ధాంత ప్రభావానికి లోనైపోతుంది" ఆసియాలో భారతదేశం సామ్యవాదమతం స్వీకరించినట్లయితే అది అమెరికా బ్రిటన్లకు గొడ్డలిపెట్టవుతుంది. కాబట్టి మన మీద అమెరికా బ్రిటన్లకు ప్రేమాదరాలు లేక పోయినా, భయంకొద్దీ అయినా మన పంచవర్ష ప్రణాళికా విజయానికి చేయూతనొసగక తప్పదు

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభంనుండి అనేక విదేశాలు, ముఖ్యంగా అమెరికా బ్రిటను, అనేక విదేశీ సంస్థలు మనకు సహాయం చేస్తూనే ఉన్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మొదటి అర్ధసంవత్సరంలో యీ క్రిందివిధంగా సహాయం లభించింది భారతదేశానికి, అమెరికా సహాయ కార్యక్రమం క్రింద రూ 809 లక్షలు, ఉచితంగానూ, రూ 2268 లక్షలు ఋణరూపంగాను భారతదేశం సహాయ్యం పొందింది పబ్లిక్ లా 480 (Public law 480) క్రింద రూ 8,571 లక్షలు ఉచితంగాను, రూ 11,148 లక్షలు ఋణరూపంగాను అమెరికానుండి మనదేశానికి లభించాయి. అదేకాలంలో ఆస్ట్రేలియానుండి రూ 4 లక్షలు, కెనడానుండి రూ 8 57 లక్షలు, న్యూజిలాండునుండి రూ 101 లక్షలు, నార్వే నుండి రూ 100 లక్షలు భారతదేశానికి ఉచితంగా లభించాయి బ్రిటన్ రు 20 కోట్లను ఋణంగా ఇచ్చింది రష్యా రూ 75 లక్షలను ఉచితంగాను, రూ 12,800 00,000 ను ఋణంగా ఇచ్చింది. ఫోర్డు ఫౌండేషన్ ఉచితంగా రు 14,00000 ఒసగింది ప్రపంచ బ్యాంకు రూ 4657 లక్షలను, బ్రిటిషు బ్యాంకులు రూ 15,00,000,00 లను, అమెరికా పరపతి బ్యాంకు రూ 5,88,000,00 లను ఋణరూపంగా భారతదేశానికి ఒసగాయి ఇవికాక కొలంబో ప్రణాళిక (Colombo plan) వలన, ఐక్యరాజ్యసమితి సహాయం వలన భారతదేశం అమిత సాంకేతిక సహాయాన్ని పొందింది

1958 జూలై 12-వ తేదీన అమెరికా సంయుక్త రాష్ట్రాల ఎగుమతి దిగుమతుల బ్యాంకు (United states Exports Imports Bank) ఒక సంవత్సరానికి సరిపోయేటట్లుగా భారతదేశానికి 150 మిలియన్ల డాలరు ఋణరూపంగా ఒసగింది ఈ ద్రవ్యాన్ని భారతదేశం నీటిపారుదల పునఃస్వాధీన పథకాలకు, శక్తి పథకాలకు, గనులకు, రవాణా సౌకర్యాలకు, పరిశ్రమలకు వినియోగింపదలచింది ఈ ఋణాన్ని భారతదేశం 5¾% వడ్డీతో పదిహేను సంవత్సరాలలో తీర్చాలి ఇదికాక ఇదేబ్యాంకు అభివృద్ధి ఋణ కార్యక్రమం క్రింద 75 మిలియన్ల డాలర్లనొసగింది

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

పబ్లిక్ లా - 480 (Public law 480) క్రింద అమెరికా ప్రభుత్వం పూర్వ సహాయం కాక అదనంగా 7 లక్షల టన్నుల ఆహారధాన్యాల కొనుగోలుకు సమ్మతించింది దీనిలో 5 లక్షల టన్నుల గోధుమ, 2 లక్షల ఇతరధాన్యాలు ఇవికాక ఇటీవల ప్రపంచ బ్యాంకు 868 మిలియన్ల డాలరు భారతదేశం రైలుమార్గాల అభివృద్ధికి ఒసగింది యూనియన్ ఆర్థిక శాఖామంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ అమెరికాయాత్ర చాలవరకు ఫలోన్ముఖమైనదనే చెప్పాలి అమెరికా వారు మనమీద గౌరవం చేసినా, మనం కమ్యూనిస్టుల మాటను కే భంగం కోద్దీ అయినా, మనకు సహాయం చేయడానికి ముందంజవేస్తున్నారు. పబ్లిక్ లా 480 క్రింద 200 మిలియన్ డాలర్ల సహాయం, అభివృద్ధి ఋణ కార్యక్రమం క్రింద వందమిలియన్ డాలర్ల సహాయం లభ్యమైనాక, మనం 1951 లో పుచ్చుకున్న గోధుమ ఋణాన్ని (Wheat loan) తో మిత్ర సంవత్సరాలపాటు వాయిదా వేశారు భారతదేశానికి సహాయం చేయడంలో ప్రపంచ బ్యాంకు చూపుతున్న ఉత్సాహం ప్రశంసనీయమైనది. ఇది భారతదేశం రైల్వే అభివృద్ధికి 85 మిలియన్ డాలర్లను ఋణపూర్వకంగా ఇచ్చినమీదట వాషింగ్టన్లో అమెరికా, ఇంగ్లండు, పశ్చిమ జర్మనీ, కెనడా, జపాన్ దేశాల ప్రతినిధులను సమావేశపరచి భారతీయులకు చేయూత నొసగవలసిన అవసరాన్ని ప్రబోధిస్తోంది గత మే, జూన్ మాసాలలో మనదేశపు ఆర్థికవ్యవస్థను పరిశీలించడానికి పర్యటించిన ప్రపంచ బ్యాంకు సభ్యులు తయారుచేసిన నివేదికలో భారత దేశపు ఆర్థిక పరిస్థితిని ప్రశంసించి, ఈ దేశంలో విదేశీయులు పెట్టుబడి పెట్టడానికి ఏమీ సంకోచింపనక్కరలేదని అభిప్రాయమిచ్చారు

ఈవిధంగా నేడు అంతర్జాతీయ ఆర్థికరంగంలో భారతదేశపు పరపతి పడిపోలేదు విదేశీ సహాయం, దిగుమతుల తగ్గింపు, ఎగుమతుల హెచ్చింపు విషయాలలో భారతదేశం క్రమంగా విజయాన్ని పొందుతోంది మనపట్లున్న విదేశాలు ముఖ్యంగా అమెరికా బ్రిటన్లు భారతీయులకు సహాయం చేయడానికి ఉత్సుకతను చూపడం హర్షదాయకం కాబట్టి ఈ పంచవర్ష ప్రణాళికయందు విదేశీ మారకపు ద్రవ్య సమస్యను భారతదేశం పరిష్కరించగలదని ఆశించవచ్చును

శ్రీనివాసరావు బజారుకెళ్ళాడు గానీ, సంచీ పుష్కలంగాని రాగంతో వాదించి ప్రయోజనం లేదు... అసలు ఎవరికిమాత్రం యీ విషయంలో ఈనాడు ఏకీ భవిస్తారు? విజంగానే, ఒక్కపూట పస్తుంటే ఏం పుట్టిమునుగుతుందో! బాగా ఆకలివేసి రెండో పూట అన్నం రుచిస్తుంది, అంతేగా! కానీ, ఒక్క పూట పస్తుండిపోతే ఏదో అవమానం, ఎంతో మోస రాంభీరంగా దిగజారిపోయినట్లు "అయ్యో! తిండానికి లేక పస్తున్నాం!!" ఆ మాటలో ఏదో పెద్ద దిగులు! "పిల్లలు కడుపులు పట్టుకుపోయి ఆలమటిస్తుంటే కళ్ళల్లో మాగాం తల్లీ దండ్రీ యిద్దరూ బ్రతికి వుండీ!" అని ఏడుపు, తిట్టుకోటం, ఏదో మహా ఘోరం జరిగిపోయినట్లే బాధపడటం ఇక తిర్యాత, తిర్యాత—"ఫలానా వాళ్ళిళ్ళ, బియ్యం లేక, అని తెచ్చుకోటానికి చిల్లిగవ్వ లేక, పస్తుపడివున్నాం" అంటూ జీవితచరిత్రలో ప్రధానఘట్టం కింద చిత్రించుకోటం

ఈ గోలంతా ఒక్కపూట తిండివి గురించి!! కో-ఆపరేటివ్ జూనియర్ ఇన్స్పెక్టరుగా చేస్తున్న మానవుకి జీవితంలో యిలాంటివే మైలురాళ్ళు!

శ్రీనివాసరావు హెడ్ క్లార్కు రామనాథం గారి దగ్గరకువెళ్దాం అనుకుంటూండగానే పిలిచాడు కృష్ణమూర్తి — 'ఏం, శ్రీనివాసులూ! మొగిలిపాలెం నించి ఎప్పుడొచ్చావ్ ఈ బస్సులోనా? మొగలి రేకులు తెచ్చావా? మా పెద్దమ్మాయి వరదా పడుతూందోయ్! 'ఇవ్వాళ మామయ్య క్యాంపునుంచి వస్తాడు, తెస్తాడు లేవే' అన్నాను"

కూరల సంచీ సైకిలుకు తగిలించుకొని, మొహం మీద జలపాతంలా ప్రవహిస్తున్న చెమట తుడుచుకొంటూ, మాపెదాల మొగలిపూల కోసం లేని బాంధవ్యాన్ని నొక్కిచెప్పుతూ, నవ్వుతూ, అలాగా నిల్చున్నాడు కృష్ణమూర్తి

"నా దగ్గర డబ్బులేదు, తీసుకురాలేకపోయా! ముందే చెప్పరాదూ!"

కృష్ణమూర్తి ముందే చెప్పేడు, చెప్పి లేే డబ్బు ఇచ్చుకోవాల్సి వస్తుందేమోనని!

"కరణానికి చెప్పలేకపోయావ్? బంట్రోతు గాళ్ళని పురమాయించేవాడు"

"వాటివిషయం అనుకోలేదు ఇంటరెస్టు లేదు. సరే, బ్రదర్! ఒక అయిదు రూపాయలు కావాలి అర్జంటుగా బియ్యం తీసుకెళ్ళాలి యింటికి"

కృష్ణమూర్తి ముఖంలో నవ్వు మాయమైంది "సారీ బ్రదర్! ఇవ్వాళ ఇరవైయ్యాడో తారీఖు అని మరిచిపోయావు కాబోలు! మనం అంతా ఒక బోటులోనే ప్రయాణం!" అంటూ సైకిలెక్కి రివ్వున మాయమయ్యాడు

శ్రీనివాసరావు రామనాథంగారి యిల్లు చేరుకునే అప్పటికి ఆయన భోజనానికి కూర్చున్నాడని తెలిసింది వరండాలో నిల్చున్నాడు శ్రీనివాసరావు చెమట పోస్తూ చాలచికాగ్గా వుంది బస్సులో రద్దీ ఇద్దరు లావుపాటి మనుష్యులమధ్య బస్సు కుదుపులకు బాగా నలిగిపోయాడు తలనిండా, ఒంటినిండా దుమ్ము చెమటతో కలిసిపోయి ముద్దముద్దగా తుడుచుకోటానికి ప్రయత్నించినకొద్దీ, అసహ్యంగా వుంటోంది బస్సు దిగి వెళ్ళగానే స్నానం చేసి, మంచంమీద వాలుదామనుకొన్నాడు ప్రయాణంలో వున్నంత సేపూ కాని ఆ యోగం పట్టలేదు మెల్లగా లేచి నెత్తికెక్కువున్న మాధ్యాహ్న రామనాథంగారి వరాండాలో విజృంభిస్తూ, దేహాన్ని బట్టల్ని చివరికి ఆ మనిషినే దుర్భరం చేస్తున్నాడు

అసహ్యించుకునే కొన్నిపటిలో దిని ప్రతి పుట్టుకు రావటం గమనించాడు శ్రీనివాసరావు. అప్రయత్నంగా ఎండిపోయిన పెదవులు నాలుకతో తడుపుకొంటూ ఎదురుగుండావున్న యింటి కిటికీవైపు చూశాడు కిటికీ తలుపు ఓరచేసుకుని రెండుకళ్ళు తనవైపు కేంద్రీకృతమై వుండటం తెలిసింది—ముఖం మీద చెమట తుడుచుకొని, జుట్టు కాస్త సవరించుకొని ఠీవిగా నిల్చుంటానటించి, చెయ్యి జేబురుమాలు కోసం పంట్లాం జేబులోకి వెళ్ళింది తీటాలుగ కాని మళ్ళీ అక్కడే జేబులోనే ఆగిపోయింది నిర్లిప్తంగా శ్రీనివాసరావు తన దృష్టి రోడ్డువైపు మళ్ళించాడు ' పక్కలు రెండు పావురాలు గూర్చుకుంటూ నలుగాగారంగా తిరుగుతున్నాయి!

శ్రీనివాసరావుకు పెద్ద విసుగు పుట్టుకొచ్చి అక్కడినుంచి వెళ్ళిపోదామనుకున్నాడు ఏం, కట్టిచేతుల్తో యింటికి వెళ్తేనేం? రాగ మొత్తుకోవటం, పిల్లల గోల అంతేకన్న ప్రమాదం ఏమీ జరగబోదు కదా! వరండా మెట్టొకటి దిగబోయాడు వెళ్ళిపోవాలని శ్రీనివాసరావు. కాని, రామనాథంగారు తలుపు తెరిచి లోపలికి రమ్మని పిలిచారు . సరే, తప్పదు!

"ఏమిటోయ్, ఈమధ్య కనిపించనే లేదు! మీ నాన్నగారు కులాసాయేనా? ఇప్పుడాయన మీ అన్నయ్యదగ్గర కదూ ఉంటోంది? వెళ్లారా?"

శ్రీనివాసరావు చెవులు మూసుకోలేదుగాని, వినటం మాత్రం మానివేశాడు "పాపం కదూ!" అని ఆగారు రామనాథంగారు

"అవును" అని అంగీకరించాడు ఏమిటో తెలియకుండానే

"ఎలుకలు పిల్లలోయ్ అకస్మాత్తుగా ఆమె పోయిందా, యిహ ఆ సంసారం గతేం కావాలి, ఆలోచించు! ఏమిటో యీ కష్టాలు!"

"అవును పాపం" అన్నాడు ఆయన్ని ప్రతిధ్వనిస్తూ

"ఈ వార్త విన్నప్పట్నుంచీ మా యింటిల్లిపాదీ విచారంలో మునిగి పోయామనుకో!" ప్రేమ మని ప్రేమ్యాసు రామనాథంగారు ప్రేమపు అపకోవటం భాగ్యం కాదు దానికి ఎందర్ని కుర్ది తెలీగు రామనాథంగారు అన్నాన హితను పరిచేసుకుంటూ అగిన అవకాశం పోగొట్టుకూడదని శ్రీనివాసరావు సాంత్వనవయానికి వచ్చేశాడు వెంటనే

"ఏమండీ. నాకో పది రూపాయలు అర్జంటుగా కావాల్సి వొచ్చాను గంట క్రితం క్యాంపు నుంచి వచ్చాను, యింటో బియ్యం నిండుకున్నాయి, చేతిలో కానీ లేదు!"

"అ( పది రూపాయలు జేబులో నాదగ్గర మాత్రం ఎక్కడుంటాయోయ్' మా ఆవిణ్ని అడుగుతానుండు

లోపలికివెళ్లి అయిదురూపాయలు తెచ్చి యిచ్చారు

"చాలా థాంక్స్ సార్ జీతం రాగానే యిస్తాను సెలవు."

* * *

స్నానంచేసి, భోజనం చెయ్యగానే కునుకు పట్టింది శ్రీనివాసరావుకు 'క్యాక'మనిఉయ్యాలలో చంటిది ఏడవటంతో మెలకువ వచ్చింది. "అబ్బ, పాడు గోల! రాధా రాధా" కేక వెయ్యాలన్న మాటాలు ఉద్రేకం వచ్చికూడా, అంచుదాటని పాలపొంగులా చల్లారిపోయింది కేక వెయ్యకుండా అలానే చూస్తున్నాడు రాధ వచ్చి పిల్లను తీసుకు వెళ్లింది రెండో వాకు—ఏన్నాం వయసు—మాత్రంపోసి ఆ కుసుం రెండు చేతుల్తో కొట్టుతూ ఆనందిస్తున్నాడు. శ్రీనివాసరావు గోడవైపు తిరిగి పడుకున్నాడు గోడ మీద కాగులు అందులో రెండు చారలు—వల్లి రక్తం కాలువ "అదుగో వల్లి! పాకోంది పెళ్ళిపోతోంది చంపాలి! ఎడమ చేతి బొటనవ్రేలితో . లోపలి ప్రేరణకు చెయ్యి మాత్రం కదల్లేదు శ్రీనివాసరావు చూస్తూ ఉండిపోయాడు "వల్లి పళిపోయింది! ఇహా కన పడదు!" పానీ ఏం మునిగిపోయినట్టు?

"ఏమండీ కాఫీ లేచి మొహం కడుక్కోండి!"

కాఫీ త్రాగి మళ్ళీ మంచంమీద కూర్చుంటే రాధ చంటిదాన్ని తెచ్చి ఒళ్లో పెట్టింది "ఇవాళ టీకి యింటో నే వుంటారు కదూ!"

"లేదు అలా వెళ్లి రావాలి"

రాధ అన్నందుకు బయలుదేరాడు ఎక్కడికి?

యాంత్రికంగా కాళ్ళీడ్చుకుంటూ చెరువుకేసి నడుస్తున్నాడు రైలు గేటు దగ్గరకు వచ్చేప్పటికి రైలువచ్చేసింది గేటు మూశారు నిలబడ్డాడు రైలుపెట్టెలోంచి వింతగా మనుష్యులు తనవంకే చూస్తున్నారు! వేగంగా పెట్టెలు ఒకదాని తర్వాత ఒకటి మనుషుల్తో వెళ్ళిపోతున్నాయి, టకా—టక్ టకా—టక్ శబ్దం చేసుకుంటూ

గేటు తెరిచారు టకా—టక్, టకా—టక్ చెవులో మోగుతూనే వుంది తలుపులు మూసుకుని కిటికీ సందుల్లోంచి తొంగి చూస్తూ కూచుంటారు ఎలుకలా బొరియలో పందికొక్కులా టకా—టక్, టకా—టక్ వెళ్ళే రైలుపెట్టెలో పాడు మనుషులు' ఆ రైలు కోసం తపెంగుకు ఆగాడుకి ఆగకపోతే తన దేహం రైలు క్రింద పడుతుంది అప్పుడు తిప్పకుండా రైలు ఆగిపోతుంది! పొలాల్లోని ఎలుకలు, బొరియలోని పందికొక్కులూ, బిలబిలా వచ్చి గుంపుగాచేరి, గలగలా శబ్దం చేస్తాయి

శ్రీనివాసరావు చెరువుగట్టుమీదకూర్చుని నీళ్ళవైపు చూశాడు తనకు నీటి ప్రమాదం లేకుండా చెరువులకి చిన్నప్పుడు తండ్రి పట్టుపట్టి ఈత నేర్పించాడు. ఎంత జాగ్రత్త!.. ప్రాణాలు ఎక్కడ

తప్పించుకొని పారిపోతారేమోనని భయం. ప్రతిదీ యిలాగే తండ్రి చెప్పినవన్నీ ఊ, ఛ, తప్పకుండా ఆచరించాడు. ఇంకా ఆచరిస్తున్నాడు. ఫలానా వాళ్లతో స్నేహం వద్దంటే మానుకున్నాడు, ఫలానా పుస్తకాలు మంచివి, చదవమంటే చదివాడు, గొప్పగుండా పరీక్షలు పాసవమంటే, అయ్యాడు, బి ఏ లో క్లాసు రావాలంటే, క్లాసు తెచ్చుకున్నాడు. ఫలానా అమ్మాయిని చేసుకో చాలమంచి సంబంధం. అంటే చేసుకున్నాడు, పిల్లల్ని కన్నాడు తండ్రీ, పెద్దలూ, మిగతా వాళ్ళూ, అందరూ ఏది మంచిది అంటారో అంతా అలానే చేశాడు యీ కో-ఆపరేటివ్ ఇన్‌స్పెక్టరు గిరీ—సర్కారు ఉద్యోగం—అలవ్యం చెయ్యడు, వంటకి ప్రవేశించు, మంచిది అంటే డిగ్రీ పుచ్చుకున్న ఏడాదే అందరి సమ్మతి ప్రకారం ప్రవేశించాడు పైఅధికారులు చెప్పింది చేస్తున్నాడు, ఎప్పుడూ తిరగబడలేదు పని చెయ్యకుండా తప్పించుకోలేదు అబద్ధాలు చెప్పలేదు, లంచాలు తీసుకోలేదు. ఇక తను చెయ్యవలసిందేమిటో ఎవరూ చెప్పలేదు ఇప్పుడు చెప్పటంలేదు రాను మాత్రం దినకార్యక్రమం జరుగుతూ వుంటుంది "ఏమండీ, మొహం కడుక్కోండి కాఫీ తాగండి స్నానం చెయ్యండి భోజనం చెయ్యండి బజారుకువెళ్ళండి ఇక పడుకోండి దీపం ఆర్పేస్తాను" ఇది జీవితం అంటే!

మరి దీన్లో ఏమి విశేషముందనీ కాకపోతే, తనలాంటి వాళ్ళు యీ జీవితంనుంచి ఏం విశేషాన్ని ఎల్లా సృష్టించగలరని ఊరికే మథ్య పెట్టటం చిన్నప్పట్నుంచీ! "ఇదుగో అబద్ధం చెప్పబోకు అందరికీ మంచిగా వుండు తల్లిదండ్రుల్ని గౌరవించు అనకుండ, విధేయత నేర్వాలో" గౌతమ బుద్ధుని లా కావచ్చునా అతి [illegible] నీతి, నీతి మరి యీ నీతిక, ఆదర్శాలకి బద్ధుడైన తనజీవితం యిల్లా రైలు పెట్టెలా, బరువు కుండలా తయారవటం ఎందుచేత? తను యింకేం చెయ్యాలి? చెయ్యాల్సిందేమీ లేనప్పుడు జీవితంనుంచి నిష్క్రమిస్తే ఏమికాదంటే పూర్వమేదో ధర్మం వుండేది యిప్పుడా ధర్మమేమీ లేదు తనకు నీటిబుల్లి చావుపోదు రైలు క్రింద పడుకుంటే గమ్మత్తుగా వుంటుంది జీవితానికి అటు వేపు ఏముందో చూడవచ్చు

శ్రీనివాసరావు తిరిగి వస్తాంటే గోపాలం కనిపించాడు గోపాలం హైస్కూల్లో టీచరు.. "శీనయ్య వహారా, ఇన్‌స్పెక్టరుగారూ!" అర్థం లేని వ్యంగ్య ధోరణి!

"వచ్చు లేదోయ్"

"నేను తీసుకువెళ్తాను రావయ్యా చాలా బాగుందంటున్నారు!" చెయ్యి పుచ్చుకుని లాక్కెళ్లాడు గోపాలం. పంట్రెండణాల టిక్కెట్టు కొన్నాడు.

జానపదచిత్రం అరగంట తర్వాత మొదలు బుద్ధి నచ్చలేదు శ్రీనివాసరావుకు "గోపాలం! నిద మాతో యింటికెళ్తు వుటంలేక నేను వెళ్తానోయ్!"

"అదేమిటి! ఎందుకని? తలనొప్పా?"

"లేదు ఊరికినే"

"ఏమిటోయ్ కారణమేమీ లేకుండానే! ఇదుగో యిహ హీరోయిన్ డాన్సు వుంటుంది కాస్తవుండు, ఎంజాయ్ చేస్తావు ఇంటరెస్టు దానంతకదే పుడ్తుంది" ఆ ఎంజాయ్‌మెంటు తనతో పంచుకుంటేగాని తృప్తిలేనట్టు ప్రాధేయపడ్డాడు గోపాలం

హీరోయిన్ డాన్సు ప్రారంభమైంది సగం తర్వాత మళ్లీ శ్రీనివాసరావు అన్నాడు. "వెళ్తానోయ్"

"పంట్రెండణాలు పెట్టావుగా బాబూ, సగం విలువైనా వసూలు, ఇంటర్వల్ దాకా వుండవోయ్!"

నిజమే డబ్బు దండగపోతాం దేనికి? ఇచ్చిన డబ్బుకోసమైనా చివరిదాకా కూచోవలసింది.. అదే అందరూ చేసేపని లేకపోతే, తిరిగి రాకుండా, డబ్బు నిర్లక్ష్యం చెయ్యటానికి! గోపాలం కవలి పెద్దడు డబ్బు వృథా కానివ్వడు తగిన కారణం లేకుండా వెళ్లటానికి వీల్లేదు

"గోపాలం! మా దంటిదానికి వంట్లో నిద్దగా వుండని చెప్పింది మా ఆవిడ నా కోసం కనిపెట్టుకుని వుంటారేమో యింటికెళ్లాలి" అబద్ధం చెప్పాడు.

"నిజంగా నేనా? యీ సంగతి ముందే ఎందుకు చెప్పలేదోయ్? పిల్లల ప్రాక్టీషనర్‌కి ఉత్తి పుణ్యానికి చూపించాను మంచివాడిలే!" విసుక్కున్నాడు

"మరి నువు వెళ్ళు"

శ్రీనివాసరావు యిల్లు చేరేటప్పటికి పెద్దవాడికి అన్నం పెడుతూవుంది శ్రీమతి మిగతా యిద్దరూ నిద్దరోతూను కంచుగా చిలక్కొయ్యకి వేసి, చాప తీసుకొని డాబామీదికి వెళ్లాడు శ్రీనివాసరావు.

చాపమీద పిల్లిలా పడుకున్న తర్వాత నక్షత్రాలకేసి చూస్తూ ప్రశ్నించుకున్నాడు—"రైలు పట్టాలమీద పడుకునేదెప్పుడు?" "ఎప్పుడో ఒకసారి, వినవది! దానికి కొంత ప్రయత్నం కావలి!" అని జవాబు వచ్చింది

శ్రీమతి మెల్లిక్కి వచ్చింది దగ్గరగ వచ్చి "ఏమండీ, పడుకోవమంగారా?" అన్నది మొగలిపువ్వు పరిమళం తెర శ్రీనివాసరావును ఉక్కిరి బిక్కిరి చేసింది.

"ఎక్కడివి మొగలిరేకులు?"

"పక్కింటావిడ ఇచ్చింది ఏం, వద్దిందవా, లేక యింకా ఆలస్యంవుందా? లేవండి! తర్వాత వచ్చి పడుకుందురుగాని!"

"ఊఁ కానీయ్," రాధ క్రిందికి వెళ్లిపోయింది

శ్రీనివాసరావుకు జ్ఞాపకం వచ్చింది నక్షత్రాలు, ఆకాశం, మొగలిరేకువాసనా, గాజుల గలగలా, చిక్కనిచీకటి, విద్యుత్ కాగిలి సుజాత, మొగల్లపాలెం వైస్త్రమణీస్కూలుటీచరు రైలు ప్రమాదంలో చనిపోయింది

ఆదర్శాలకి, నీతికి బద్ధుడుగా తిరుక్కుడున్నాడు?, రెండేళ్ల క్రితం సుజాతతో ప్రణయం అది అవినీతి, రాధకు అన్యాయం పెళ్లయిన తాతాకోవలసిన రహస్యం కప్పింపుకవెళ్లిన ఒక్కొక్కసారి ఒక సుమధురమైన అనుభవం సుజాత తనతోటి చేసుకుంది భయపడ్డాడు, బాధ పడ్డాడు కప్పింపుకుంచి తీసుకొచ్చిన ప్రతి పర్యాయం పశ్చాత్తాప పడ్డాడు కాని, సుజాతను చూసి గానే భయమూ బాధో, పశ్చాత్తాపమూ, పాపమూ, అన్నీ అంతర్ధానమయ్యేవి! ఎంత మంచిది సుజాత! ఆమె కోరిన ప్రతిఫలం ఏమీలేదు ఒక సారి, 'బాగుంటుంది'అనుకొని, పదిహేను రూపాయలు పెట్టి షిఫానుచీర కొనుక్కొని తీసుకువెళ్లితే ఏడ్చింది... తర్వాత చాల తిరుక్కుందా నే, సుజాత లేదు!

"ఏఁ వండోయ్, మిమ్మల్నే! ఎంతసే రాగమిటే?"

ప్రత్యక్షానుభవంగా ఉన్నప్పుడు భయమూ బాధా కలిగించినా దానిజ్ఞాపకాలంగానే ఆ రహస్యంలో మొగలిపువ్వు వాసన, నక్షత్రాలు, ఆకాశం ఆనందం వీటితో పాటు తినూ వుంటాడు!



# ఛా యా సం వా ద ము

శ్రీ బొ డ్డు బా పి రా జు

వ రు డు

ఓయి, నా వెంట బడక నేంచేయుమోయి.
నీకు పుణ్యమ్ము నా తోడ రాకయున్న
ఒక్క నిమిషమ్ము నిలిచి నిట్టూర్పుకొనగ
విడువు మేకాంతముగ నన్ను, వేడుకొందు!

ఇన్నాళ్లున్ నను వెంటబెట్టుకొని యూరేగించితీవ్, నేడు నీ
వన్నన్ కత్తులమీది సామయిన, దేలా నన్ను వేధించుచున్
వెన్నాడంగ? చిరంతనంబయిన యానేస్తంబు పాటించి నీ
డొక్కన్నన్ దీపము పెట్టి నిన్ దలచి పేర్కొందున్ దయాసింధువున్

ఛా య

తల్లి యుదరమ్మునుండి భూతలముమీద
అడుగుమోపని మొదలు నీయడుగుజాడ
విడక కొలిచిన అగ్రజన్ముడను నేను
నేడు తెగతెంచినన్ ముడివీడి పోదు!

పసితనపుం దువాళముల, భవ్యకళా కమనీయ సాహితీ
వ్యసనములందు, జవ్వనపువాలు మెరుంగుల కోరమీనముల్
మినమినలాడునప్పు, డవినీత జరాపరిరంభ వేళలన్
విసుగక తోడునీడనయి నిన్ను భజించు ఫలంబు లిట్టివే?

వ రు డు

మానిని యన్న వెన్క ఒకమాటును మర్మము లేక యుండ, ద
వ్యాని మెకందలో పసిడిపాన్పుల నిద్దురవోని కోర్కులన్
తానయి తీర్చుకోవలయు దారులు గోప్యము, లెట్టిచాటు వి
య్యానకు తోటిపెండ్లికొడుకై చనుదెంతువు, దుర్భరమ్మురా!

అలసెన్ నా బ్రదుకెల్ల నీ తగులమాయానంబుగా,—కామినీ
లలితాశ్లేషసుఖానుభోగములు—మిత్రశ్రేణి సల్లాప వా
క్సులభావంద మధుక్షణమ్ములు—కృతిస్తోమాను సంధాన ని
స్తుల నిర్వేలసుధాముహూర్తములు నీతో దక్కలేవయ్యెలే!

కలదట తల్లికైన మరుగన్నది, రెండవ కంటి వానికిన్
తెలియగరాని, యాత్మగత దేవరహస్యము లెల్ల తీర్చుకో
వలె నిను చంకబెట్టుకొని, పాయని ఈ తగులం బశాంతికి
న్నిలవయి, పర్వపుంబడగ సీడల కాపురమట్లు వేచెడిన్.

వేపురిలోన 'యుంచి'దనిపించెదులే పయి తళ్కుపూత, నీ
జీవిత—'మూపసిండివగిపీ' తెరచాటున దాగియున్న దు
ర్భావభయానకమ్ము అసిపత్రవనమ్మను నీవెరింగి యు
న్నా'వని గుండెలో మసలు నాకు సుఖమ్ముగ నిద్రపట్టునా?

ఛాయ

నావలన కాదు భయమిది,
నీ వరిగెడు డొంకత్రోవ నిను వెరపించున్.
కేవల మనుచరుడను న
న్నీ విధమున దుయ్యబట్ట నేమగునయ్యా?

ఆపదలందు, సంపదలయందు, సుఖమ్ముల, రోగశయ్యలన్
ప్రాపులమండి పాలుగొను నాప్తుడ, ఆపయి నాలుబిడ్డలున్
తిపులు చెల్లుబెట్టకొని నిన్ను చితాగ్నుల కిచ్చునాడు నన్
జాపక చెల్మిమై విడువనొల్లని నాయెడనా కృతఘ్నతల్?

బ్రదుకు వైకుంఠపాళి నీపావు గెలిచి
నిచ్చెనల నెక్కి నందరు మెచ్చుకొంద్రు,
పాములకు జిక్కి దిగజారి పడెడు వేళ
నిన్ను కనిపెట్టుకొని యుండు నేనొకండ!

కులమర్యాదలు గాలికిన్ వదలి, పోకుల్ పెంచి, గొంతెమ్మ కో
ర్కులు పండించుకొనంగడంగి పెడదారుల్ త్రొక్క, వల్లించు నీ
తలకున్ మావక చేయుచేతలకు నీ దోబూచులన్ జూచియు
'న్వలదన్నా,' యని ఒక్కనాడయిన నేవారింపనే లేదుగా!

వేసిరి పేకమేడలకు వెల్లలు. లోకపుకంటిమూనలో
పోసివెలార్చు నీ సొగసుబొమ్మ, నసల్ సిసలైన మూర్తిని
త్రాసున తూచి వాటితలలన్ ధరకట్టుట ఎంత సేపు? నీ
వేసము లన్నియుం దెలిసి వెంబడి వచ్చెద మూగసాక్షినై.

## ఛాయా సంవాదము

### నరుడు

నిండిన వేయి లాభములు నీవలనన్ మరి—యుంచి చెడ్డలం
బొండనకుండజాడ? పని కోప యామగనిడింట నుండినట్
దండుననున్న నొక్కటె కదా? చనుమన్నను చూరుబట్టి వ్రే
లుండగ మేలనోయి, కలదో బలవంతపు బ్రాహ్మణార్థమున్!

ప్రతిపద భయావ్యదమ్ము జీవితపథమ్ము
దుస్సహము చేసితివి నీ తోడి పొత్తు
చాలు! వదలించి భవదీయ సాహచర్య
శృంఖలాబంధనము, దయచేయు మింక.

### ఛాయ

అంభోధి నమృతంబు హాలహాలము భంగి
నీలోన కనరాక నెలవు కొనుచు
ప్రబలంబులై పరస్పరజిగీష నజస్ర
మలయుచు మంచి చెడ్డలును రెండు
దేవదానవుల రీతిని కలహింపగా
దివురు, వివేకాగ్ని నివురుగప్పె,
పెడదాగులకు పోయి పుడమి కన్నులు మూయు
తెరవులో బ్రదుకె దుర్భరముగాగ

నీవు నన్ను శంకించుచున్నావు గాక
హానిలేదోయి నావల్ల—వ్యాధి యొకటి
మందొకటి యైన నయమౌనె? ముందు నీవు
చక్కబడినంత అంతయు చక్కబడును!

జీతము బత్తె మివ్వని దినీ! కూలువేమిటి నాకు? ఇట్టి నం
గాతము తీర్చుకూర్చు మనకావిధి, నేనగవాడగాను, నీ
చేతల కీడుమేళ్లు జమచేయగవచ్చిన కర్మసాక్షి నో
యీ, తగవేల మేలితెరువెంచి చరించి సుఖించు మీపయిన్

సన్నిరిగి కన్ను తెరచిన
అన్నరునకు కాన్పితోవ నడుగుపడునె? నా
సన్నిధి సుస్థిరమ్ములకున్
పెన్నిధి యని తెలిసి బ్రతుకు వెలిగింపుమురా!

# కలగూరగంప

## ఆప్తమిత్రుడు తెన్నేటి సూరి

శ్రీ పి. శ్రీరాములు

వార్త రాకడా ప్రాణంపోకడా ఎవరికీ తెలియదంటారు.

అక్టోబరు 16 గురువారం అనుకుంటాను ఆ క్రితం రోజునుంచే ఎడతెరిపిలేని వర్షం. ఎక్కడికీ కదలడానికి వీల్లేదు. మధ్యాహ్నం రెండుగంటలయ్యేసరికి



అశనిపాతంలాంటి వార్త అందింది. ఆప్తమిత్రుడు తెన్నేటి సూరి మరణించాడని విని నిలువుగా నీరైపోయాను. సూరి మరణించాడంటే నమ్మలేకపోయాను. అంతకు సరిగా రెండురోజుల క్రితం చూడడానికి వెళ్ళినప్పుడు అయినవరంలోని అద్దెఇంట్లో మంచంమీద పడుకొని ఏదో బాధపడుతున్నాడు. ఆ బాధ మరణవేదనే అని గ్రహించలేకపోయాను. మరో ముప్పయిఆరు గంటలలో మృత్యుదేవత కబళించి వేయబోతున్నదని ఊహించలేకపోయాను.

ఆ బక్కపలచటి శరీరమూ, దానికి తగిన ఎత్తూ, కోటేరు వేసినట్లు కనిపించే ఆ పొడుగాటి ముక్కూ, విశాలమైన దబ్బకాయలాంటి తళతళ మెరిసే ఆ కళ్లూ, ఆ కళ్లలోనుంచి వెలువడే తీక్ష్ణమైన చూపులూ, ఆ చూపులలో గోచరించే చురుకైన తెలివితేటలూ, మందహాసం విరజిమ్మే ఆ కోలముఖమూ మరిచిపోదామన్నా మరపురావు.

జీవించింది యాభై యేళ్లలోపే అయినప్పటికీ అందులో సగభాగానికి పైగా తెన్నేటి సూరి సాహిత్యసేవకే వినియోగించాడు. కవిగా, కథకుడుగా నవలా రచయితగా, నాటక కర్తగా తెలుగుదేశంలో పేరు ప్రఖ్యాతి ఆర్జించుకున్నాడు. తన పేరుతోనూ 'సిరపాణి' అనే మారుపేరుతోనూ అనేక రచనలు ప్రచురించాడు. వాటిలో [illegible] కథలు, అరుణరేఖలు, బాణాటి (నాటకం), చెంఘిస్‌ఖాన్ మొదలైనవి ముఖ్య రచనలు. చెంఘీస్‌ఖాన్ నవల ఆంధ్రపత్రిక సారస్వత అనుబంధంలో సీరియల్ గా వెలువడింది. అనువాదమైనప్పటికీ, సొంతరచనే అయినట్లే సూరి ప్రతిరచనలోనూ ప్రతిభా వ్యక్తిత్వాలు ప్రస్ఫుటంగా గోచరిస్తుంటాయి. అనువాదంలో అతని ప్రతిభకు 'రెండు మహానగరాలు' ఒక తిరుగులేని నిదర్శనం. ఇది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్ గా ప్రచురణ అయింది.

జీవిత సమస్యలపైగాని, సాహిత్య సమస్యలమీద గాని, ఏ ఇతర విషయాలపైగాని తెన్నేటి సూరిని నిద్రలేపి అడిగినా ఖండితమైన, అతి స్వతంత్రమైన భావాలు ప్రకటించేవాడు. తన భావాలు ఎదటివారికి నచ్చినా నచ్చకపోయినా కుండబద్దలు కొట్టినట్లు నిర్మొహమాటంగా చెప్పివేయడం సూరి ప్రత్యేకత. తన కలం హలంగా, తాను సిరపాణిగా పత్రికల్లో సాహిత్య వ్యవసాయం చేశాడు. ఎప్పుడో నవయుగోదయ మవుతుందని దానికి నాందిగా "మానవ స్వాతంత్ర్య 'మాగ్నాకార్టా' పైన రక్తాక్షరాలతో వ్రాలు చేసేశాను" అని తన 'అరుణరేఖలు' అనే గేయ సంపుటిలో వ్రాసుకున్నాడు.

సూరి భావాలు మనకు ఇంకా స్పష్టంగా అర్థం కావాలంటే "అరుణరేఖలు" లోని ఈ క్రింది పంక్తులు మచ్చుముక్కలుగా ఉపయోగపడతాయి.

